# మా యుద్దేశములు !

---

(1) దేశాభివృద్ధికి భాషాభివృద్ధి గొప్పసాధనము. దేశములోని గ్రంథసంగ్రహంబును వార్తాపత్రికలును నేదోయొక దైవికకారణముచే నేఁడు లేకుండనయ్యెనేని ఆ దేశము తన యాదిమ యుగములోని యనాగరికతకు దిగుననిచెప్పుట యతిశయోక్తి గానేరదు. దేశమునందలి వాఙ్మయము ఆ దేశమునకు మేలుగాని కీడుగాని కలుగఁజేయఁగల యొక నిరంకుశాధికారి యని చెప్పవచ్చును. ఇట్టి శక్తిగల వాఙ్మయమున దగిన గ్రంథములులేని భాష శిశువులవచ్చిరాని పలుకులవంటిదై వ్యవహారమునకును జ్ఞానసంపాదనమునకును పనికి రాకుండును.

(2) ఈ యుద్దేశమును మనము నందిడుకొని మేము దేశచరిత్రలను, ప్రకృతిశాస్త్రములను, వ్యక్తిచరిత్రలను, చరిత్రవిషయక నవలలను, నీతిబోధక గ్రంథములను ప్రచురింప సమకట్టితిమి. ఆ ప్రకారము విజ్ఞానచంద్రికా గ్రంథమాలయందిప్పటికి 25 గ్రంథములు ప్రచురితములైనవి. అందు 13 ప్రకృతిశాస్త్రములు, 5 దేశచరిత్రలు, 4 వ్యక్తిచరిత్రలు, 3 నవలలు. ఇవియన్నియు తజ్ఞులగు వారిచే వ్రాయఁబడినవి. చిత్రపటములచే శోభిల్లుచుండును. సుందరమైన క్యాలికో బైండు చేయబడినవి. గ్రంథమాలరూపమున వెలువడు నీ గ్రంథములను ప్రసిద్ధ వాఙ్మయమని విద్వాంసుల అభిప్రాయము.

(3) ఈ గ్రంథములు జనసముదాయము కొనుటకు వీలగునట్లు బహుకొద్ది వెలల కిచ్చుచున్నాము. శాశ్వతపు చందాదారులపద్ధతిని యమ్మబడును. మేము ప్రచురించు పుస్తకముల గొనువారు శాశ్వతపు చందాదారులు. అట్టివారికి నూరుపుటలకు 0-4-0 లచొ పోస్టేజి మేమేభరించి యిచ్చెదము. ఇతరులకు పోస్టేజిగాక 0-6-0 లగును. చందాదారులు వెనుకటి పుస్తకముల నన్నిటిని గొనునెడల 0-4-0 లు ముందుపుస్తకములను మాత్రము గొనునెడల 1-0-0 ప్రవేశరుసుము నియ్యవలెను. 0-4-0 లు ప్రవేశరుసుమిచ్చి వెనుకటివాని నన్నిటిని యొక్కసారి కొనలేనియెడల ఒక్కొకసారి రు 5-0-0 ల వెలగల పుస్తకములు దఫాలవారిగ తెప్పించుకొనవచ్చును. పుస్తకముల వీ. పీ. గాపంపి సొమ్ము రాబట్టుకొందుము.

జూన్ నెల. 1914 } ఆ. లక్ష్మీపతి, బి. ఏ. ఎం. బి. సి. ఎం.

హాం సెక్రటరి.

# తయారగుచున్న గ్రంథములు

---

ఆంధ్రులచరిత్రము (మూడవభాగము)

చిలుకూరు వీరభద్రరావుగారు

అర్థశాస్త్రము (రెండవభాగము)

క. రామలింగారెడ్డి, ఎం. ఎ. గారు

స్వీయచరిత్రము (రెండవభాగము)

రా. బ. క. వీరేశలింగము పంతులుగారు

విజయనగర సామ్రాజ్యము (నవల)

దుగ్గిరాల రాఘవచంద్రయ్యగారు

పాతాళభైరవి (నవల)

ఎ. వి. నరసింహము పంతులుగారు

భూగర్భశాస్త్రము (Geology)

త. పానకాలరావు, బి. ఏ. గారు

---

మహారాష్ట్ర మహాయుగము

కే. వి. లక్ష్మణరావు, ఎం. ఏ. గార్లు

రెండవసారి !

రెండవదఫా

# నవల్లాభహుమతి

# రు. 500-0-0 లు

కథ

హిందూదేశ చరిత్రాత్మకముగా-

నుండవలెను

గ్రంథము

1915వ సంవత్సరము ఏప్రిల్ 31వ తేదిలోగా

విజ్ఞానచంద్రికా కార్యాలయమునకు

చేరవలెను.

నిబంధనలు మునుపటివలెనే

విశేషములు తెలిసికొనగోరువారు మాకు వ్రాయవలయును.

ఆ. లక్ష్మీపతి, బి. ఏ. ఎం. బి. సి. ఎం.

ఏప్రిల్ 1914

మేనేజరు—విజ్ఞానచంద్రిక

చింతాద్రిపేట—మద్రాసు.

# Political Economy

*With special reference to Indian Conditions*



**First Part**

BY

CATTAMANCHI RAMALINGA REDDY,

*Fellow of the Madras University and author of 'Musalamma Maranam' (Poem) and 'Kavitvatatvavicharam' (Principles of Poetry) etc., in Telugu*

Vol. II.

MADRAS:

THE VIJNANA CHANDRIKA MANDALI

1914.

విజ్ఞానచంద్రికా గ్రంథమాల.

# అర్థశాస్త్రము.

మొదటి భాగము

ఇది

కట్టమంచి - రామలింగారెడ్డి చే

రచియింపఁబడినది

“[illegible]
[illegible]
సర్వభాగ్యసిద్ధు [illegible]
[illegible]” (భాగతము)

సంపుటము. ౨

చెన్నపట్టణము

సర్వస్వామ్యసంకలితము] ౧౯౧౪. [వె. ౧-౪-౦.

# పీఠిక

శ్రీ విజ్ఞాన చంద్రికా మండలివారిచేఁ గడచిన సంవత్సరము ప్రకటింపఁబడిన అర్థశాస్త్రమునకు నియ్యది రెండవ సంపుటము. ఇందు ఉత్పత్తికాండములోన శేషించిన భాగమంతయు సంపూర్ణముగఁ బొందింపఁబడి యున్నది.

ఈ రెండు సంపుటములు గలసిన గ్రంథమును నేను 1911-వ సంవత్సర మధ్యమున వ్రాయ నారంభించి 1912-వ సంవత్సరము మార్చి నెలలో ముగించితినిగాని యనేక కారణములంబట్టి యింత యాలస్యమానంతరము సమగ్రముగఁ బ్రకటింపఁజాలనైతిని. అందుచే విషయ విచారణయందు సందర్భానుసారముగ సూచింపఁబడిన కాలనిర్ణయములు అసత్యములైనఁ గ్రంథమున వానిని గూర్చిన వివరములు నివేదింప వలసి వచ్చెను.

ఈ గ్రంథమును ముద్రించిన ఇండియా ముద్రాక్షరశాలవారికిని, విచారణకర్తలును ఉత్తరవాదులునై యజమానులట్లు ఆ కార్యమును మిక్కిలి చక్కఁగా నిర్వర్తించిన హెచ్. వి. కృష్ణా అండు కో. గారికిని మనఃపూర్వక వందనములు. ఇదివఱలో [illegible] గ్రంథములఁ బ్రకటించి యాతాపత్రయముల ననుభవించిన వాఁడను. అట్లగుట వీరివలె అతిశీఘ్రముగను అతిశుద్ధముగను ముద్రణకార్యమును నెఱ

వేర్చినవాడిని నేటివఱకు చెన్నపురి హిందూవులలో నెవ్వండి యుండలేదని సమ్మదముమై తెల్పుటకెంతయుం గుతూహలుం బయ్యెడిని.

ఈ గ్రంథము ముద్రణములోనున్న కాలమ్మున బుస్తక శోధన కార్యమ్మునను నెప్పటియట్ల శ్రీయుత. అనంత కృష్ణ శర్మగారు నాకు పలుభంగులం దోడుపడిరి.

విజ్ఞాన చంద్రికామండలి వారియొక్క- ప్రోత్సాహము నిర్బంధము లేనిది నేనీ శాస్త్రరచనకుం బూనియుండనేనసు !
ఇకం బ్రచురించువారును వారేయగుట నాకుసర్వవిధములు మాన నీయులు.

మైనూరు,
1-7-1914

కట్టమంచి - రామలింగా రెడ్డి.

# విషయసూచిక

(ఉత్పత్తి కాండమున శేషించిన భాగము)

## మొదటి ప్రకరణము

(౧-౨౮) పుట.

### వృత్తుల పరిణామము


గ్రామ్య పద్ధతి ... ౧

ఐరోపియనుల గృహ జీవితము ... ౭

హిందువులలో గ్రామపద్ధతి ప్రముఖంబుగ నుంటకింకను హేతువు లివియనిన ... ౯

వైవాహిక కార్యాచారముల యుత్పత్తి .... ౧౧

గ్రామ్య పద్ధతి నుద్ధరించు కారణములు ... ౧౪

వాణిజ్యోత్పత్తి విత రీతిరాశ్రయములు ... ౧౫

గ్రామ్య వ్యవహారముల వలనఁ గలుగు కీడులు ... ౧౬

భిన్న వృత్తులు ... ౧౭

శ్రీగృహ పరిచ్ఛేదము ... ౧౮

గ్రామ్యపద్ధతి స్వాతంత్ర్యఘ్నము ... ౧౯

గ్రామ్య పద్ధతిలో జనులకు స్వతంత్రత లేదనుటకు నిదర్శనములు ౨౧

మామూళ్లు జీతములు పనులు నేర్పడియుండుట ... ౨౪


## రెండవ ప్రకరణము

(౨౯ - ౪౪)

### వృత్తుల పరిణామము

### ఇతర పద్ధతులు


శ్రేణి పద్ధతి ... ౨౯

శ్రేణుల్ల ముఖ్య లక్షణములు ... ౩౮

పరతంత్రపద్ధతులు ... ౩౧
నివేశన వృత్తి ... ౩౨
ఆవేశన వృత్తి ... ౩౩
శ్రమ విశ్లేషణము, తత్పరిమితియు ... ౩౫

## మూడవ ప్రకరణము

(౪౫ - ౯౨)

ఆధునిక వృత్తి నిర్మాణము లందలి సామాన్య లక్షణములు

నిరర్గళ స్పర్థ ... ౪౫
జాతిభేదమువలని కీడులు ... ౪౬
స్పర్థయొక్క నిర్వచనము ... ౫౨
శ్రమకరుల స్పర్థ ... ౫౪
మూలధన స్పర్థ ... ౫౭
మన కృషికరుల స్పర్థ ... ౫౮
స్పర్థవలని లాభ నష్టములు ... ౬౦

## నాల్గవ ప్రకరణము

(౯౩ - ౧౧౮)

ఆధునిక వృత్తి నిర్మాణములందలి సామాన్య లక్షణములు

శ్రమ విశ్లేషము ... ౯౩
విశ్లేషము సామర్థ్యాతిశయకరము ... ,,
శ్రమ విశ్లేషమున కనుకూలించు సమయములు ... ౧౦౫
శ్రమ విశ్లేషమువలని లాభములు ... ౧౦౭
శ్రమ విశ్లేషమువలని నష్టములు ... ౧౧౩

## ఐదవ ప్రకరణము

(౧౧౯ - ౧౩౬)

వ్యవహార నిర్మాతలు

వ్యవహారములు విస్తరించుట ... ౧౧౯
ఈ వ్యాప్తిచేసైన మాఱుపాటు లెవ్వియనిన ... ౧౨౧

నాశము ... ౧౨౮
సంభూయ సముత్థానములు ... ౧౩౦
సంభూయ సముత్థాన నిర్మాణము ... ౧౩౨

## ఆరవ ప్రకరణము

(౧౩౮ - ౧౫౮)

### సంశ్లేష విధానములు

సంక్షోభావ తత్త్వము ... ౧౩౮
బలాత్కార సంశ్లేష ... ౧౪౦
స్వతంత్ర సంశ్లేష ... ౧౪౧
వ్యక్తివాదము ... ౧౪౪
సమష్టివాదము ... ౧౪౬
అమితస్పర్థ, అనిరోధ స్వామ్యము ... ౧౫౦
సమష్టికి నాయకత్వంబుఁ గుదుర్పవలయుననువారలవర్గంబు లేవియన ౧౫౫

## అధిక ప్రకరణము

(౧౫౯ - ౧౭౧)

### న్యాయతత్త్వము

న్యాయశబ్ద నిర్వచనము ... ౧౫౯
ఈ త్రివిధ న్యాయములకు మఱియొక యంతరము ౧౬౫
ప్రభుమార్గ సమష్టి వాదుల యుత్తరము ... ౧౭౭

## ఏడవ ప్రకరణము

(౧౭౩ - ౨౧౬)

### విస్తారవ్యాపారములు

మూలధన సంశ్లేషణ ... ౧౭౩
సంభూయసముత్థానములయొక్క గుణములు ... ౧౭౫
ఇంక లోపములు ... ౧౭౬

హిందూదేశములోని జాయింటు స్టాకుకంపెనీలు ... ౧౯౨
విస్తార్ణవ్యాపారము ... ౧౯౫
స్థానసాంగత్యము ... ౧౯౬
స్థానసాంగత్యము వలనిగుణము లెవ్వియనిన ... ౧౯౯
విస్తార్ణశాలలు ... ౨౦౪
సవిస్తరతను మితము సొనర్చు హేతువులు ... ౨౦౭
పణ్యసౌలభ్య మనఁగా నసాయాసముగ దూరగస్థులకైన నమ్ముకొనుపొవు గుణము ... ౨౧౧
విస్తారశాలలు ప్రభవిల్లు వృత్తులు ... ౨౧౩

ఎనిమిదవ ప్రకరణము

(౨౧౬ - ౨౪౦)

క్షోభలు

ఆర్థికమాత్సర్యముచేఁ బుట్టు ననర్థములు ... ౨౧౬
ఆర్థికక్షోభలు ... ౨౨౨
అధికోత్పత్తిక్షోభ ... ,,
అల్పోత్పత్తిచే గలుగు నపాయంబులు ... ౨౨౪
కొన్నిక్షోభల చరిత్రము ... ౨౨౭
1825-వ సంవత్సరపు మహాక్షోభ ... ౨౨౯
క్షోభల సామాన్యలక్షణములు ... ,,
ఖండాఖండ క్షోభలు ... ౨౩౧
క్షోభలయొక్క యొకలక్షణము వెలలు వ్రాలుట ౨౩౫
క్షోభలు వ్యక్తిస్థితిచే సంభవించునవియనువాదప్రకారగము ౨౩౫

తొమ్మిదవ ప్రకరణము

(౨౪౧-౨౯౦)

స్పర్ధను రద్దుపఱచు తంత్రములు

మాత్సర్యము నిరోధింపఁజేయు వ్యవహారికముల పద్ధతులు ౨౪౧
వ్యవహార సమాజములు ధర్మసంధిజేసికొనుట ... ౨౪౨

సంఘసంఘము లేర్పడుటకుఁ గారణములు ... ,,

ధర్మసంఘ చోదకులప్రవర్తన ... ౨౪౪

రాజ్యాంగము వారు ధర్మసంఘుల బంధింపఁ జూచుట ౨౪౬

ఈయుపాఖ్యానముయొక్క యాదేశమేమనిన ... ౨౫౦

ట్రస్టులచేఁ గలుగవలసిన లాభములెవ్వియనిన ... ౨౫౬

ధర్మసంఘ సంఘములంగూర్చి సమష్టివాదు లుపన్యసించు ప్రకారము ౨౫౭

ఇంగ్లాండులో సంఘ సంఘములు ప్రబలకుండుట... ౨౫౯

అన్యోన్యతా పద్ధతులు ... ౨౬౦

పరస్పర సముదాయముల చరిత్రము ... ౨౬౨

వినిమయాజకాన్యోన్య సంఘములు ... ౨౬౨

ఇంగ్లాండు గాక తక్కిన పశ్చిమదేశములలోని కో ఆపరేటివ్ ,,

సంఘముల చరిత్రములు ... ౨౬౯

కో ఆపరేటివ్ ఉత్పత్తికాలలు ... ౨౭౨

కో ఆపరేషన్ వలనఁ గలుగు శ్రేయస్సులు ... ౨౭౩

స్పర్ధను నిరోధింపఁజూచుట యననేమి? ... ౨౭౭

ఏయార్థిక నీతియందుఁగాని మూఁడు విధములైన స్పర్ధలం

శాశ్వతములు ... ౨౭౯

అన్యోన్యతా పద్ధతియొక్క ముఖ్యగుణంబులన్నను ౨౯౧

# స్ఖాలిత్య సంస్కరణసూచిక

| పుట | గీతులు | స్ఖాలిత్యము | సంస్కరణము |
|---|---|---|---|
| ౨౯ | ౧ | అజ్ఞానినోఁగాని | అజ్ఞానినోఁదిరిగాని |
| ౩౧ | ౧౬ | యూరోపు | యూరోప్తు |
| ౩౩ | ౧౪ | ౨వులత | విపులత |
| ౩౬ | ౫ | శిల్పల | శిల్పుల |
| ౪౩ | ౨ | పావము | పాపము |
| ౫౬ | ౧ | దుష్థి | దుష్థితి |
| ౫౯ | ౧౮ | నశ్వరము | అనశ్వరము |
| ౧౦౪ | ౧౧ | తెలించుట | తేలించుట |
| ౧౦౭ | ౯ | వగును | వగను |
| ౧౧౬ | ౧౯ | కాంతి | కాంతము |
| ౧౪౩ | ౨ | యుత్పత్తివర్తకము, | యుత్పత్తి, వర్తకము, |
| ౧౪౮ | ౧౭ | సామాద్యుపాయ | సామాది యుతరోపాయ |
| ౧౬౨ | ౧౫ | కావున నిగంజనత నిర్వికారత జడత్వమును. | కావున నిరంజనత నిర్వికారత, జడత్వమును |
| ౨౪౨ | ౨౧ | కొందురి | కొందఱు |
| ౨౫౯ | ౨౧ | బంఁజేతురు | బనిఁజేతురు |

VISWANATHAN TEKUMALLA,
FLAT 501, 'PRASANTH TOWERS'
MUSHIRABAD MAIN ROAD,
HYDERABAD-500048. (A.P.)

# సంపాదకీయ భూమిక

---

మ-రా-రా-శ్రీ, కట్టమంచి - రామలింగారెడ్డిగారు రచియించిన అర్థశాస్త్రోత్పత్తి కాండముయొక్క రెండవ సంపుటమును, ఆంధ్రప్రపంచమునకు సమర్పించుచున్నాము ఆంధ్రభాషలో, అర్థశాస్త్రరచనయొక్క యవసరమునుగూర్చి మొదటి సంపుటముయొక్క యుపోద్ఘాతములో కొంతవఱకు వ్రాసియున్నాము. ప్రస్తుతకాలమున ప్రపంచములోని జాతులయొక్క పోటీయంతయును ద్రవ్య సముపార్జనకొఱకే అయియున్నది. రాజ్యములు సంపాదించుటయును ఆయాజాతులయొక్క వర్తక వ్యాపారముల నభివృద్ధిచేసికొని ధనవంతులగుటకే.

ఇక్కాలమున భాగ్యవంతములగు దేశములే నాగరకాగ్రగణ్యములని ఎన్నబడుచున్నవి. మన పాలకుల దేశమగు ఇంగ్లాండులో నగటున సంవత్సరమునకు ప్రతిమనిషియొక్క ఆదాయము ముప్పదిమూడు పౌండ్లు, లేక రు. ౪౯౫ లు ఇక మనదేశమందన్ననో, రు. ౨౭-౦-౦లు. ఇట్టి యార్థికస్థితిలో, తత్త్వవిచారమునందు మనపూర్వులు మిక్కిలి గొప్పవారని మనమెంత గర్వపడినను, మనల గౌరవించు దేశీయులెవరుందురు? కడుబీద.

వారమగుటవలనస్వయంసహాయ్యమువలన నేవిషయమునుగూడ సాధింపలేకున్నారము. ఇంగ్లాండులోని విశ్వవిద్యాలయములు విద్యాలయములు మొదలగు వానిలో చాలభాగము ధారతనము వారికి సంబంధములేకుండ విదేశీయులవలన నేర్పాటు చేయబడినవే. ఇంతేకాక ఇంగ్లాండు దేశీయులు కోట్లకొలంది ద్రవ్యమును ప్రోగుచేసి తమ క్రైస్తవ మతబోధకులను హిందూదేశము మొదలగు నితర దేశములకుబంపి విద్యావ్యాపనమునకును హీనజాతుల యభివృద్ధికినిదోడ్పడి తమ మతమును నాగరకతనుగూడ వ్యాపింపజేయుచున్నారు. మన దేశములో ప్రతిగ్రామమునందును పాఠశాలలు కావలెను. స్త్రీలకు, ఉన్నత విద్యనిచ్చు పాఠశాలలు కావలెను. అనాధ శరణాలయములు కావలెను. రాజకీయజ్ఞానమును జనులలో వ్యాపింపజేయు సంఘములు కావలెను. వృత్తులుకళలనునేర్పు జాతీయ పాఠశాలలు కావలెను. ఇంక నెన్నియో కావలెను. వీని కన్నిటికి మనకు ద్రవ్యమెక్కడ? మనము కడుబీదవారము. ప్రతివిషయమునకును మన దారిద్ర్యమే అడ్డమువచ్చుచున్నది. ఇంగ్లాండు మొదలగు భాగ్యవంతమయిన దేశములలో లక్షలకొలంది రూప్యములతో సంఘము లేర్పఱచి యంత్రములతో మిక్కిలి శీఘ్రకాలములో బట్టలు మొదలగు వస్తువులు తయారుచేసి పొగయోడలమీదను రైళ్లమీదను మనదేశమునకు తెచ్చి మనకు విక్రయించి విశేషమైనలాభమును గొనిపోవుచున్నారు.

ఈ యంత్రములమీఁద తయారైన వస్తువుల పోటీవలన మన దేశములో చేతితో చేయబడు వస్తువులు చౌకగా నమ్మలేక క్షీణించినవి. ఇందువలన మన సాలీలు మొదలగు పనివాండ్ర వృత్తులన్నియు నశించి దారిద్ర్యాంబుధిలోఁ గ్రుంగిపోయినవి. మన దేశమునుండి మిక్కిలి ధనము ఈ వర్తకలాభముద్వారా విదేశములకు సంతతధారగాఁ బ్రవహించుచున్నది. మన యాంగ్లేయ దొరతనమువారు మన దేశములో శాంతిని నెలకొల్పినను నిష్పాక్షికమైన న్యాయస్థానముల స్థాపించినను నాగరకమగు ఇంగ్లీషువిద్యను వ్యాపింపఁజేయుచున్నను, రైళ్లు, తంతి, తపాలా మొదలగునవి ఏర్పాటు చేసినను మన దేశము నానాటికి ఎక్కువ బీదదియగుచున్నది. కాటకమే సామాన్యస్థితియగుచున్నది. ఇంగ్లాండు మొదలగు దేశము లెక్కువభాగ్యవంతము లగుచున్నవి. కాఁబట్టి ఇత్తరుణమున "నా దేశముయొక్క దారిద్ర్యమెట్లు పోవును? ఎన్నఁడు నా దేశములోని వృత్తులు వ్యాపారములు వృద్ధిఁజెంది నా దేశమైశ్వర్యవంతమై ఇతర నాగరక దేశములతోఁ దులతూగును? ఎన్నఁడు ఇతర దేశములయొక్క యభివృద్ధికిని నాగరకతకును దోడ్పడుటకు నా దేశీయులు ధనమును బంపఁగలిగుదురు?" అను తలంపులు మన దేశముయొక్క ప్రస్తుతావస్థనుగూర్చి తెలిసిన ప్రతిహైందవుని హృదయమును దహించక మానవు.

సృష్టిలోని ప్రతి పరిణామమునకును క్షీణమునకును కొన్ని నిబంధన లెట్లుండునో అట్లే అర్థోత్పత్తియు నార్థికాభి

వృద్ధియుఁ గొన్ని నియమముల ననుసరించియుండును. ఈయార్థిక న్యాయములను నియమములనుగూర్చి తెలుపునది అర్థశాస్త్రము. నాగరకత చెందినదని పేరుగాంచిన ప్రతి జాతియును అర్థశాస్త్రమును జాతీయ జీవనమునకు ముఖ్యమైన శాస్త్రముగా పరిగణించుచున్నది. మన దేశము భాగ్యవంతమగుటకు మన దేశీయులు అర్థశాస్త్ర నియమములను బాగుగా దెలిసికొని పనిచేసి తీరవలెను. ఆయా దేశముయొక్క సాంఘికాచారములనుబట్టియు రాజకీయస్థితిగతులనుబట్టియు, ఆర్థిక నియమములుండునుగాన, ఇంగ్లాండులో పనికివచ్చు పద్ధతులు మన దేశమునకు సర్వత్ర పనికిరావు. మన దేశముయొక్క రాజకీయ సాంఘిక స్థితులనుబట్టి సామాన్యప్రజలకు తెలియులాగు మన దేశభాషలలో నర్థశాస్త్రముండుట అవసరము. కావున ఈ గ్రంథకర్తగారు వలయినంతవఱకు మన దేశపు స్థితిగతులను మనస్సునందుంచుకొనియే ఈ అర్థశాస్త్రమును వ్రాసియున్నారు. మన దేశముయొక్క ప్రస్తుతస్థితిలో నర్థశాస్త్రముయొక్క ప్రాముఖ్యత ఇంతయని చెప్పుటకు వీలులేదు. ఆంధ్రభాషలో నీ శాస్త్రమును రచించి గొప్ప కొఱంతను నివారింపఁ బ్రయత్నించినందులకు రామలింగారెడ్డిగారు మనకృతజ్ఞతకుఁ బాత్రులు. మొదటి సంపుటమును మా చదువరులు చదివియున్నారు గనుకను గ్రంథకర్తగారు పాఠకులకు కృత పరిచయులు గనుకను గ్రంథకర్తగారి శక్తి సామర్థ్యములను గూర్చిగాని గ్రంథ

ముయొక్క ప్రాశస్త్యమునుగూర్చి గాని మేము వేఱుగ వ్రాయ నక్కఱ లేదు.

మన దేశమునందు పూర్వకాలమున నాగరికాభివృద్ధికి కులభేదము చాల తోడ్పడినది. వివిధ వృత్తులు వివిధ జాతులు నెలవేర్చుచు ఆయా వృత్తులను గాపాడి వృద్ధిచేసినవి. వంశ పారంపర్యముగ తెలివి తేటలు పనివాండ్రకుం గలిగియుండెడిది. కాని ఇప్పటి పాశ్చాత్య యంత్ర నిర్మాణ కౌశలము ముందరను పాశ్చాత్య వర్తక సంఘముల యెదుటను మన ప్రాత ఏర్పాట్లు నిలువనేరక ఎగిరిపోయినవి. ఈ కాలమున రైళ్లతోను పొగయోడలతోను తంతివార్తలతోను అన్ని దేశములును కలుపంబడియున్నవి. నాగరక దేశములలో విద్యావంతులు వివిధ పరిశ్రమలను వృత్తులను హైన్యమని యెంచక వానిని అవలంబించియున్నారు. మన దేశమందు వడ్రంగము, కుమ్మర పని, చెప్పులు తయారుచేయుట, నేతపని మొదలగు వృత్తులు విద్యావిహీనులకు వదలి వేయంబడినవి. చేతిపనులం జేయుట హీనమని యెంచి విశేష తెలివిని గలిగినట్టియు విద్యావంతు లగునట్టియు కులముల వారు ప్లీడరి మొదలగు ఉద్యోగములకుం గాని సర్కారు నౌకరీకిగాని వెళ్లుచున్నారు. ఇందువలన చేతి పనులు పరిశ్రమలు వృత్తులు తెలివిహీనుల చేతులలోం బడి మిక్కిలి మోటు పద్ధతులలో జరుపబడి మన దేశములో జఱుగు చున్న మార్పులతోం బాటు అభివృద్ధి చెందక క్షీణించినవి.

చదువుకొనినవారు విశేషముగ మందియు నిరాశించుచున్న సర్కారుద్యోగములు స్వల్పములునయి చదువుకొనిన వారందఱకుఁ బనులు దొరకక అసంతృప్తిని జెందుచున్నారు. కాబట్టి మన దేశీయధనమును నభివృద్ధి చేయవలె నన్న విద్యావంతులగు వారు చేతిపనులు, వృత్తులు మొదలగు వాని నీచమని యెంచక వీనినే తమజీవనాధారముగఁ గైకొనవలెను. ఈ వృత్తులకుఁ దగిన కౌశలమును వీరు చూపఁగలరు. క్రొత్త మార్గములనుగూడ కనుగొందురు. ప్రాతకులకట్టుబాట్లు మన ఆర్థికాభివృద్ధికేమాత్రమును నిఁక ముందుఁ దోడ్పడ నేరవు.

పూర్వకాలమున నితర దేశములు మనకన్న మిక్కిలి తక్కువస్థితి యందున్నపుడు మన పనివాండ్రు నేతపని మొదలగు చేతిపనులనన్నియు మగ్గములు మొదలగు స్వల్ప వెలగల పనిముట్ల సహాయముతోఁ జేతితోనే చేసి అమ్ముచుండెడివారు. ఇప్పుడు ఇంగ్లాడు మొదలగు దేశములలో నావిరి యంత్రములతో సమస్త వస్తువులు తయారు చేయఁబడుచున్నవి. ఒక వస్తువును మనవాండ్రు చేతితో తయారు చేయవలెనన్న కొన్ని రోజులు పట్టును. యంత్రముమీఁద ఒకరోజుకు, ఏబదివేల వస్తువులు మనవాండ్రు చేతితో చేసినదానికన్న నునుపుగాను చౌకగాను దయారుచేయఁబడును. కాన మన దేశీయులును యంత్ర

సాహాయ్యమున బట్టలు మొదలగు సమస్త వస్తువులను చేసి తీరవలెను. లేనియెడల మన వృత్తులు పునరుద్ధారణ కాంజాలవు.

ఈ యంత్రములు మిక్కిలి విలువగలవి. ఒక్కొక యంత్రశాలకు కొన్ని లక్షల రూప్యములు గావలెను. కనుక వెనుకటివలె ప్రతి కుటుంబమువారును ప్రత్యేక ప్రత్యేకముగా పనులుచేసి కొనుటకు వీలులేదు. దేశములోని ద్రవ్యవంతులు చాలమంది కలిసి భాగమునకు కొంతచొప్పున విశేష ద్రవ్యమునుచేర్చి సంఘములు పెట్టి యంత్రశాలలు స్థాపించి విరివిగా వస్తువులను దయారుచేసి విశేషలాభమును బొందవలెను. ఇట్లు చేయనియెడల నితర దేశముల పోటీలో మనము నిలువంజాలము.

ఇట్లు సంఘములు పెట్టి పనిచేయుటకుం బ్రజలలో ఒకరియం దొకరికి నమ్మకముండవలెను. రెండవ వారునమ్ముటకు వారిలో యోగ్యప్రవర్తన ఉండవలెను. భాగస్థులలో ఒకరి నొకరు మోసపుచ్చుటకుం బ్రయత్నించి దివాలాలుతీసిన వర్తక సంఘములు మన దేశములో మెండుగానున్నవి. ఇది కడుశోచనీయము. కావున మనదేశముయొక్క భాగ్య మభివృద్ధి చెందవలెనన్న మనదేశములో సత్యము నీతి అభివృద్ధికావలెను.

ఇట్టి విషయములన్నియు గ్రంథకర్తగారు మిక్కిలి విపులముగాను నైపుణ్యముగాను, బెక్కు పట్ల నుదాహరణములతో నీ సంపుట మందు వ్రాసినారు. సాంఘిక విషయములను

గూర్చి వ్రాసినపట్లు పాఠకులలో కొందఱకు అభిప్రాయ భేదములు కలిగినను వానినంతగా పాటింపక ఆసక్తి ప్రపంచమీగ్రంథము నాదరించి దీనివలనఁ బొందఁదగిన యుపయోగములను బొందుదురుగాక యని కోరుచున్నాము.

సహాయ సంపాదకుఁడు.



# అర్థశాస్త్రము

## మొదటి ప్రకరణము

### వృత్తుల పరిణామము

(౧) గ్రామ్యపద్ధతి:—

పూర్వమున రాకపోకలు రక్షణమును లేనికాలములో దేశము ఖండఖండములుగా తెగినట్లు, సహజముగ నొండొంటితో నెక్కువ సంబంధములేని గ్రామములుగ విభక్తమయ్యెను. పేరునకు దేశమొక్కటిగ నున్నను సత్యమునకుం బెక్కు తునకలై యుండెను. గ్రామస్థులు త్రిశంకుస్వర్గములోని వారి యట్లు ప్రత్యేకించి తమకు వలయువానినెల్లం దామే సేకరించికొనుచు, మిగిలినదాని నమ్ముటకును, లోపించినదానిం గొనుటకును నవకాశము లేనందున సాధ్యమైనంతవఱకు ప్రతి గ్రామమును సర్వవస్తుసమృద్ధముగా నుండునట్లు నిర్మించుకొని, తా మొకరిసిజూడక, యొకరికిం దామగపడక, యంతఃపురకాంతలట్లు తమతమ నెలవులను కాలుగదల్పక తరతరములుగ నుండినందున, నూతనసంగతుల స్పర్శమైన లేనివారై, నానాంటికి జ్ఞానహీనులును సాహసదూరులు నైరి. ఏకమార్గమునం బోవువారికి నుత్తమ మధ్యమాధమ నిర్ణయశక్తి పూజ్యము. పలుతెఱవుల జాడలెఱింగినంగాని తారతమ్య నిరూ

పణ మశక్యముగదా! విమర్శనజ్ఞాన మున్ననో సమునపేక్షు. విమర్శనము లేనిది వివేకోదయ ముండదు. అట్టిది లేనిజనులు మూఢులై "తాంబట్టినకుందేటికి మూఁడేకాళ్ళు" అన్నట్లు తమ యాచారములు, వాడుకలు, మతములు, వేషములును ఎంత కష్టనష్టాపాదకములై రోఁతను విసుగును బుట్టించునవియైనను, తదితరసుఖకర మార్గము లున్నవియని స్థానిక తెలిసికొనఁగోరక, వీనికి మించినవేవియు లేవని వృథా యభిమానముఁ బొంది, వృద్ధి నొందక యధోగతి పాలగుదురు.

పాపము! ఇప్పటికిని హిందువులలో బహుజనులు పల్లెవాసు లింకను నీగ్రామ్యపద్ధతియందే మునిఁగియున్నారు. మార్గములు! వచ్చుటకుఁ బోవుటకును సులభముగానున్నచో వాణిజ్యము వర్ధిల్లును. వాణిజ్యవ్యాప్తిచే దూరస్థలముల నుండి మనము గోరిన వస్తువుల రప్పించుకొనవచ్చును. అట్లయ్యేని ప్రతిగ్రామ మందును వడ్రంగి, కమ్మరి, కంసాలి, చాకలి, పురోహితుఁడును, ఉండి తీరవలయు ననువిధి యక్కఱ లేనిదగును. ఈవిధ పూర్వముండె ననుట గ్రామనిర్మాణమొకఁడేగిన నీతిశాస్త్రము దెల్లంబు. కావున దేశము భిన్నమై యరాజకమై అల్లకల్లోలములుగనుండిన కాలమున మనగ్రామములును, వైదికసాహిత్యాద్యాచారవ్యవస్థితులును నేర్పడిన వని పల్కుటయొప్పుఁగాని, ఇది వేదములు, ఋషులు వీరిచే నుత్కృష్టతమములని నిర్ధారింపఁబడిన వనుట పుక్కిటి పురాణము. ఆకాలమున నింతకన్న మేలైన నిర్మాణ

మసాధ్యము. అది నిపముగ నిఁక వేకాలమునకును నింతకన్న మిన్నయగు నిర్మాణ మసాధ్య మనుట కేవలము మూఢత్వము.

హిందువులలో నీప్రాచీన గ్రామ్యపద్ధతి యింకను యౌవన దశయందే యున్నదిగాన మనకు దాని స్థితిగతుల నెఱుంగుట యావశ్యకము. అందునకుఁ దగినంత సుగమమును.

నవనాగరకతావాసన గాలిదాఁటుననైన నెన్నఁడును సోఁకని కుగ్రామము నొకదానిని వర్ణింతము. ఊరివాకిలియొద్ద నడుగువెట్టఁగానే, మిత్రులకు సంతోషమును, శత్రులకు తస్కరులకు (ముఖ్యముగా వారిపాదములకు) భయము నొసంగునదినై, చూచినవెంటనే మేనులఁ గుచ్చునో యనునట్లుండు కఱకుముండ్లతో నెలయు నాగదాడికంచె యొకటి మున్ముందర అభేద్యప్రాకారంబై కనులపండువు సేయును. ఊరివారు సోమరిపోతులుగాన ముఖద్వారముగుండ రాకపోకలుచేసిన చుట్టుగదాయని తమతమయిండ్ల సమీపమున నెలుగును బడఁగొట్టి తప్పుద్రోవలఁ జేసి ప్రాకారముయొక్క ముఖ్యోద్దేశ్యమును పాడుపఱచి తమసహజబుద్ధి కౌశల్యమును వెల్లడిసేయుట యచటఁ గనులారఁజూడవచ్చును. గ్రామరక్షణ కార్యమింతటితో ముగిసెనా? పొగాకును వక్కాకును ముద్దగాఁజేర్చి పెట్టికొనుటచే నుబికిన కపోలఫలకంబుగలిగి, ఠీవిగాఁ దుడుముఁ దట్టుచు రాత్రులలోఁ దోఁటివాఁడొకఁడు పారాతిరుగును. ఈ యొయ్యారము లన్నియు నరాజకమువలనఁ గలిగినవని వేఱ యెత్తి చెప్పనేల?

రక్షణవిషయమున నెట్లు గ్రామస్థులకు రాజ్యమునకుఁగాని నిలువక ప్రత్యేకముగఁ గ్రామముల చేర్పఱచుకొను నవస్థ యాయెనో, యట్లే యార్థికవిషయములందును. [illegible], నమ్మకముతో వర్తించుభటులు, పక్షపాతము లేని న్యాయాధికారులు, నిరంతరకలహప్రియులుగాని ప్రజలఁ బీడింపని రాజులును లేని దేశములో వాణిజ్యము లుండవు కాన, ప్రతిగ్రామమునను సామగ్రులన్నిఁటిని దామే యుత్పత్తి చేసికొనవలసిన వ్యవస్థతటస్థించె. కావుననే పల్లెలలో మంగలి, చాకలి, కమ్మరి, వడ్రంగి, కంసాలి, కుమ్మరి, మేదరి, మొదలగువారేగు నివసించి యుండుటయు, వీరిలో ననేకులకు గ్రామస్థులు శాశ్వతముగా నందఱుఁగలిసి యేఁటేఁటకు నింతింతయని మాన్యముల నిచ్చుటయు సంభవించినది. కలహములఁ దీర్చుటకు పంచాయతీదారులు, పూజాపునస్కారములకు మంత్రములు పలికి తెలియని పురోహితుఁడు, లెక్కలను పక్కలుముక్కలుగా వ్రాయుటకు కరణము, తానెన్ని తప్పులఁ జేయుచున్నను ఇతరులయొద్ద ధర్మమును భద్రముగ నిలువుటకు రెడ్డికాపుకఁడు—, ఇట్లు వీరిచే గ్రామములు రాజ్యము లట్లు సర్వాంగబంధురములై పరస్పరభిన్నములై బయటివారితోఁ గలయిక లేనివై యేర్పడినవి.

మఱియు రాజ్యములట్లు గ్రామములు నొండొంటి పైఁ గాలు ద్రవ్వి కాట్లాడుటయుఁ గలదు. ఒకయూర 'కలరాదేవి'

విడిసిన నామమును సాగనంపుట కెత్తంబడిన గరిగెను. ఇంకొక యూరి యెల్లలోపల "ఇచటదిగి కడుపాఱ విందుసేయుచున్నాము" అని దింపిరేని, ఇరుపల్లియలవారికిని భారత సంగరమును చేయనిపించునంతటి వాగ్వాదము రేగి యాకసము బ్రద్దలుసేయును!

మోటుతన మంతయుదిరిన వారి కైనను రవంత యేని వర్తకము లేని బ్రదుకు మృగములకుంగాని మనుజులకుఁ బ్రాతిగాదుకదా! కావున నిట్టి గ్రామ్యజనులుగూడ పర్వదినంబులను, పండుగపూటలను, ఉత్సవకాలమ్ములను, ఇరుగుపొరుగు జనులు గుమిగూడుదు రనియు, అట్లు కూడినను దేవతల కప్రియమాచరించిన తమకు నశుభములు గలుగునను భయంబున, నట్టి తరుణమ్ముల జగడములకుద్యమింపరనియు, పుణ్యస్థలములలో సంతల నేర్పఱచి తమకుమిగిలిన సరకులనమ్మి కొఱఁతపడిన వానిం గొని సంతుష్టివడయుదురు. భీతిచేత సన్మార్గవర్తులై యుండుట గనుసుజనుల తెఱంగు. అశ్వత్థము పరమపవిత్రమని భావింపఁబనుటం జేసి యావృక్షము నీడలోఁ గల్లలాడరని యచటవిచారణలు జరుపుట యాచారమయ్యె. జ్ఞానవంతు లీశ్వరుఁ డెల్లప్పుడు నెల్లెడల నున్నాఁడని యెప్పుడును బొంకరు. ధర్మపథాసక్తహృదయులు గాకపోవుటచే మూర్తిమంతములైన బూటకములఁజూపి మూఢజనుల వెఱపించుట యగత్యమయ్యె. శపథములు, స్వామిపాదములుముట్టి ప్రమాణముసేయుట, గురుపాదతీర్థమిప్పించుట, ఇత్యాదినీచతరక్రియలు వనచరులంబోలిన నరు

లుండు దేశమ్ములం బ్రవర్తిల్లుట కిదియ నిదానము. బుద్ధియు గుణమ్ములును వికసిల్లినవారికిట్టి యపచారమ్ములు దుస్సహములు. అది యట్లుండె.

ఇచ్చుట తీయుటయు విశేషించి లేనందున ప్రతికుటుంబమువారును సామగ్రులం దామే యాయతములం జేసికొనవలసిన విధియేర్పడియె. కాలక్రమమున నీయభ్యాసమువలన, నితరులచేఁ జేయఁబడువస్తువులు వాడుట యాచారములోనికి రామింజేసి, యట్టివి శుచిపదార్థములు గావనియు, ఉపయోజ్యములు గావనియు, విధించుకొని, "గోరుచుట్టు మీఁద రోఁకటిపోటు' అన్నట్లు ఉన్న ప్రాతయిక్కట్టులు చాలవని క్రొత్తవి కొన్ని కల్పించుకొని, భగవత్సంకల్పము నిట్టేయని, తమమాత మంతయును దాకుట, చూచుట, తినుట, పీనింగూర్చిన వ్యవహారము క్రిందికి దింపిరి. ఈ న్యాయములకు సాక్షులు మనయిండ్లే. నేఁటికిని పల్లెటూళ్ళలో దీపమువత్తులుచేయుట, సెనగకాయలు, ఇప్పకాయలు, వేఁపకాయలు, వీనినిబలుచుట, వడ్లు దంచుట, రాగులు, నువ్వులు, కందులు, పెసలు ఇత్యాదులను విసరుట, ధాన్యముల నెండఁ బోయుట, వడియములు అప్పడములు పెట్టుట, పొళ్ళుదంచుట, దంచినవానిని నూరుట, ఇత్యాది కృత్యము లనేకములు ఆయాయింటివారు తమకుఁ దామే చేసికొనుట సుప్రసిద్ధము. ఇంగ్లీషువారి కిది యాశ్చర్యకరంబు. 'ఈ హిందువులు నివసించునవి కర్మశాలలా యిండ్లా!' యని

యబ్బురపడుదురు. మఱియు పశువుల్లను గూడ ననేకులు గృహా ములలోనే కట్టుదురుగాన కొట్టములా యని సందేహించినను దప్పులేదు!

## ఐరోపియనుల గృహాజీవితము

ఇఁక నిక్లే యాంగ్లేయుల గృహాజీవితములఁ దిలకింపుఁడు! వారిలో నిఱుపేదలుగ నున్నంగాని జీవనార్థమైన కర్మల నింటిలోఁ జేయరు. జీవనోపాయములఁ జెల్లించుటకు అంగళ్లు కర్మశాలలు కచ్చేరీలు నుండఁగాఁ బవలంతయు నచటఁ బనినేసి యలసి సొలసి యిల్లుఁజేరినతఱి పనిపాటుల మఱచి హాయిగఁ గొంతసేపయిన భార్యా పుత్రులతో సల్లాపము చేయుచు నంద ఱుఁగలసి ముచ్చటగా భోజనాదులఁ దీర్చి విశ్రాంతి ననుభ వింప గృహాము లేర్పడినవిగాని, రేయింబవలును క్లేశభాజనము లైన శ్రమల మెడఁగట్టికొని మెలంగుటకుఁ గాదని వారి దృఢ మైన యభిప్రాయము. అవశ్యక క్రియలలో నొక వంటపని దప్ప మఱేమియు నింట నుండనియ్యరు. వంటపని యనఁగా వంటపనియే కాని యందులకు వలయు సంబారములం దయారు చేయుట గాదు. సంబారముల సర్వ విధముల సిద్ధపఱచి యమ్ముదురు. జాతిమతాది భేదరహిత రమణీయ రాజ్యముగాన యథేచ్ఛముగ వస్తువులఁ గొనవచ్చును. దానం జేసి వారిగృహా ములు పరిశుభ్రములై నచ్చు నవయికలు లేక హృదయా నందకరంబులై సంసారతమంబు నడంపంజాలు తేజస్సులం

బోలె దేదీప్యమానంబులై యుండు. ఇట్లయిన గృహస్థులు సోమరులై నిద్రాళువులై యుందురో యను శంక వొడమునేమో? అట్లెంచుట కుశంక. చదువులు, సంగీతములు, బిడ్డలకు విద్యల నేర్పుట, కుట్టుపని, వస్త్రాలంకార రచన, ఇత్యాది నాగరక ప్రచారములు వేనవేలున్నవి. వానినెల్ల బహు శ్రద్ధతో నభ్యసించి జన్మమును సార్థకముగను సముల్లాసశోభితముగను నొనర్చుట లేశకార్యమా? యోచింపుఁడు!

"అవునుగాని సంబారములన్నింటిని గొనవలయుననన్న సెలవెక్కువయగుంగాదె! ఈ దుర్ఘటకార్యమును వారెట్లు సాధింతురు? మాపురుషులు నట్టిసత్త్వసంపన్నులయినచో మాకీ నిరంతరకాయకష్టము లేకపోవునుగదా! అట్టినాగరకతను నేర్చి వారివలె కళగానుండు నంతటి భాగ్యము మాకీ జన్మమున రాఁజాలునా!" యని స్త్రీలు ముఖమును చిన్నఁజేసికొని ప్రశ్నింతురు కాఁబోలు! సమాధానమిదిగో! :—

మనమే యన్నివస్తువుల రచించుటకన్న శక్తియుక్తులకు దీటగుమాడ్కి నేదైన నొక్కదానినో కొన్నింటినో యమితముగఁ బ్రోగుచేసితిమేని మనకై మిగిలిన రాసులనమ్మి యితరములఁగొనవచ్చుననుట యేమిచోద్యము? ఇంగ్లీషువారి వర్తనలరీతి యిదియే. ఏకవృత్తిలోఁ బ్రవేశించి వాణిజ్యమూలమున సర్వసామగ్రులఁ బడయుదురు. మనము నమ్మకము చెడినవారి

గుంపులోనుండుట, జాతిభేదముల్కు, దూరదృష్టి లేమి, ఇత్యాది వ్యసనముల్కు కతమ్మున్నలుగ భిన్నులమై సమూహములో నుండియు నొంటరులైన యడవిమనుష్యులట్లు వర్తింప వలసిన వారమైతిమి! పరివర్తన పారీణతయుండెనేని సంఘమంతయుఁ బ్రతివానికిని వలయు సామగ్రుల నిచ్చునిధియైయుండును. సంఘము వారందఱు నన్యోన్యసహాయులైనమేలా? ప్రత్యేకముగ నాతురతమై యొకరికి సాయముఁజేయక తానొకరివలనఁ గోరక తనకుఁగావలసిన వన్నియుఁ దానే బడయఁజూచుట మేలా? తలపోసిచూడుఁడు. అన్నిఁటిని జేయఁజూచిన నేదియు సరిగాఁ గుదురదనుట పరమరహస్యమా? మన మాతురతగాని యొకరిని నమ్మక పరులపొత్తునాశింపక యన్నింటిసిఁ జేయఁజూతుము. ఫలమో! పండి పండని పాడుఫలమే! రాకపోకలను వాణిజ్యమును విచ్చలవిడిగఁ బెంచి యొండొరులకు సహాయభూతులై యూరోపియనులు సర్వభోగ సమృద్ధతామహిమచే శోభిల్లెదరు. ఇది విస్మయావహంబు గాదు.

హిందువులలో గ్రామ్యపద్ధతి ప్రముఖంబుగ నుంటకింకను హేతువులెవ్వియనిన?

గృహములను ఫ్యాక్టొరీలుగాఁ జేసియుంచిన మొదల కష్టములో బహుళభాగము స్త్రీలనెత్తిమీఁదఁబడును. కాన ధీరోదారభావము లేని తుచ్ఛులగు పురుషులకిది యనుకూలించిన యేర్పాటు. మనదేశమున నబల లనఁబడువారు మగవారి

కన్న నెన్నియో మడుంగులు ఎక్కువగ పాటుపడుటం జూచి పాశ్చాత్యులు మనల నతినీచమానవులని పరిహసించెదరు. బావులు త్రవ్వుట, ఇండ్లుకట్టుట, రోడ్లువేయుట, ఇత్యాది యత్నములలో నీళ్లు త్రాళ్లుమోయుట, సున్నమునూరుట, ఇట్టి దుర్భరకార్యము లనేకములు స్త్రీలకే చేరిన వరప్రసాదములు. ఇంగ్లాండులో భారవహనభాగ్యము స్త్రీలకిప్పు డేమాత్రమును లేదు. మోటువారికిని నాగరకులకును నిదియొక ప్రబలమైన యంతరము. ఎట్లనిన:—ఆఫ్రికాఖండములో మొలగుడ్డ దప్ప నింకేమియు లేక యడవిమనుష్యులఁ బోలి సంచరించు కాఫరులను తెగవారిలో పురుషులు బహుభార్యోపేతులై యుండుట సర్వసహజము. ఈకృష్ణలీలకు కారణము కామము గాదు. మఱికర్మమా? కర్మమునుగాదు. కర్మవిమోచనము! అనఁగా, పెండ్లాలను బనిచేయుఁడనియానతిచ్చి తాము చుట్టఁ గాల్చుచు హాయిగాఁగూర్చుండి తనిఖీచేయుచు నిష్కర్ములై యుండవలయునను నిచ్ఛ. అనేకజాయత్వవ్యాపార ప్రారంభమునకిట్టి యోచనలే ప్రధానములు. ఏదేశమున స్త్రీలు బిడ్డలును పశుసమానులుగఁ బరిగణింపఁబడుదురో యచట పశుసంతతి యెంత తఱుచైన నంతమేలు, అను న్యాయప్రకారమే, భార్యాసమృద్ధిని, సంతాన సంపదను బడయఁగాంచుట, అర్థసమృద్ధ్యాదిశోభనసహితం బగుట, సదాచారసమత వహించును. ప్రకృతము మనలో నిట్టి దౌర్భాగ్యపు నడవడులు

మిక్కిలి కొఱఁతవడియున్నను, ఇంకను గృహకృత్యసౌలభ్యము నకై ద్వితీయ వివాహములకు సమకట్టు వారు తుట్టాఁగా లేకపోలేదు.

## వైవాహికాద్యాచారముల యుత్పత్తి

వైవాహిక నియమములకుఁ బుట్టినిండ్లు ధర్మశాస్త్రములు గావు. మఱియార్థిక స్థితిగతులు. దారిద్ర్య మతిశయించుటచేఁ గాని, ఇరుగుపొరుగు శత్రుజాతులవారిచేనైనఁగాని, యొక తెగవారి కుత్పాతములు ప్రసన్నములయ్యేనేని, యే ఋషీశ్వరుని ప్రేరేపణమును లేకయు, సుఖరక్షణముల నపేక్షించి యెట్టి మార్గముననైనఁ గొడుకులఁ గాంచనెంచుట స్వాభావికగుణము. మనపూర్వులైన యార్యులు, ఈదేశముపై దండెత్తి వచ్చిన యాదికాలమున వారిసంఖ్యస్వల్పము. శాత్రవులన్నవో లెక్కకు మీఱియుండిరి. యుద్ధములు ప్రతిదినచర్యలు. అట్లగుట „ అపుత్రస్య గతిర్నాస్తి " యని నుడివిరి! అనఁగా సంఘమునకు శత్రుమోక్షణము సంపాదించుకొఱకే కాని తమ యాత్మల నింద్రలోకములోనిలిపి యన్యాయముగ నగ్నిలో నేయిపోసి పాడుచేయుటచే తృప్తిఁజెందించుటకుంగాదు. సంఘముయొక్కయు, తద్వారా ప్రజలయొక్కయు స్థితికై పుత్రులంబడయుట ప్రాణాధార సంస్కారమయ్యె! దానంజేసి మన కిప్పుడు నీతిబాహ్యములు, రోతలుగఁదోఁచుమార్గంబులనైన సంతానప్రాప్తి కారంభించి విచ్చలవిడిగ సంబంధములకుం

దొడంగిరి: ఇయ్యవి సర్వసాధారణములైనందున ధర్మంబులని చెప్పఁబడియె. విధియేమున్నది! అందఱుఁ జేయువానిని అధర్మములన్న భ్రష్టులెవరు? భ్రష్టులంజేయువారెవరు? పూర్వము ధర్మము నాలుగు పాదములతో నడిచె ననుటకిదే యేమో యర్థము! అనఁగా నెట్టిపాపకార్యములుగూడ ధర్మకార్యములని యాదరింపఁబడిన నిఁకనధర్మమెక్కడనుండివచ్చును? చూడుఁడు! మను బ్రహ్మగారిస్మృతిలో నెన్నివిధముల పుత్రులు పేర్కొనఁబడియున్నారో!

ఔరసుఁడు:-భార్యయందు భర్తకుఁబుట్టినవాఁడు. ఇదిసరియే.

క్షేత్రజుఁడు:-చనిపోయినవానియు, బిడ్డలులేనివానియు, భార్యయందు నియుక్త ప్రకారమింకొకనిచేఁ బుట్టింపఁబడినవాఁడు.

దత్తుఁడు:-ఇదియు సరియే. ఇందేమియు దోషముగానరాదు.

గూఢోత్పన్నుఁడు:-భర్తకుఁ దెలియకయే భార్యయతనికిఁబరునివలనఁ బ్రసాదింపించిన పుత్రుఁడు!

కానీనుఁడు:-పెండ్లికాకమునుపే కన్యచేఁగన్న కుమారుఁడు!!

సహోఢుఁడు:-పెండ్లియపుడే గర్భముతోనున్న స్త్రీకి జనించినవాఁడు!!!

ఇట్టి యనాచారము లనేకములు సదాచారములుగఁ బూర్వము పాటింపఁబడినవి. వివాహములు నట్లే. బలాత్కారముగ నిష్టములేని వనితను జెఱఁగొనిపోయి చెఱచిన నదియు

నొకవివాహమంట! ఇఁక వివాహమ్ముకాని దెద్దియో నిరూపింప బ్రహ్మకైన నలవికాదు. కృతయుగ రీతి యిట్లుండిన ధర్మ దేవతకు కుంటితనమెట్లు సంభవించును? ఎంత లోతులోఁబడి నను గాళ్ళు విఱుగవుగాన ధర్మము విధిలేక నాలుగు పాదము లతో వర్తింప వలసిన దాయెను! అందఱు గ్రుడ్డివారుగా నుండిన రంభలుగాని రమణు లుందురె? అంధకారమున నంద ఱును సుందరులే!

ఇది యసంగత ప్రలాపమని యూహింపఁబోకుఁడు. మన లోని యాచారము లనేకములు కష్టకాలమున నుద్భవించిన వనియు, ఋషిప్రోక్తములు గావనియు నార్థికదశలచేఁ దీర్పఁ బడినవనియు, నట్లగుటఁ గాలదేశాను గుణముగ వీనిని మార్పు టలోఁ దప్పులేకుండుటయు కాదు, సర్వవిధముల నొప్పనియుఁ దాత్పర్యము. ధర్మార్థములకుఁడు నన్యోన్య సంబంధము వివా హములందుబలె నితర ప్రతీతుల యందంత విశదంబుగాదు.

ఇంగ్లాండులో పురుషులకన్న స్త్రీల నెక్కువగఁ జూతురు. దుర్ఘటములు క్లేశసహితములునైన క్రియలు వారి భాగమునకు రావు. పత్నీశుశ్రూషయే పరమధర్మంబు. మనలో పతివ్రత మనునది యెట్లో వారలలో సతీవ్రత మనునది యట్లు. కావున భార్య లెక్కువయైన భర్తకు భారమెక్కువ యగుట సిద్ధము. మఱియు సేవకుల కనేకత్వము చెల్లునుగాని నాయకులకు చెల్లదు. స్త్రీలు నాయికలు, యజమానురాండ్రు. కావున సపత్నీ

వారి యంతరంగముల పైతము త్రవ్విత్రవ్వి చూడ యత్నింతురు. సమీపస్థులును ఊరిలోఁ బెద్దలును గావున కనులెంత దూరము పాఱునో నోరంతదూరము వాగను. వీరికి వీరిమాటయే శాస్త్రము. వాదమే వేదము. కావున నిదిపదిమందికిఁ జెందినది చెందనిది యను విచారములేక సమస్త విషయములం గూర్చియుఁ గాలక్షేపార్థము సగమును తమ యాడంబరములం బ్రకటించుటకును బొట్టవోసికొనుటకును సగమునుగా గుజగుజలువోయి యావజ్జీవము జనులకు గజిబిజి సేతురు. మనుజుఁడు సమూహవాసిగావున న్యాయమునకుం గాకున్న భయమునకైనను విధేయతను జూపుటయో నటించుటయో యాచరించును. "మనజనులది సంఘముగాదు. మంద" యని కొందఱు వాదించిరి. మందయొక్క తీరెట్టిది? గొఱ్ఱెలు ప్రక్కనప్రక్కన మేయును. విచ్చలవిడిగ దవ్వులఁ బోవలయునన్న ధైర్యము సాలదు. నూతన మార్గములన్న భూతములట్లు! ఒండొంటి నోలయునవియైనను నన్నియు నచ్చుకొట్టినట్లొకే మాదిరి నుండునవి గావున నితరేతర సంబంధములకు నెడములేదు. కావున దేహముల పొత్తేకాని మనసుల కలయిక మృగ్యము. మనసులా? మనకు మన మనసులున్నఁగదా! మనకున్న వన్నియు పూర్వీకుల మనసులే. ఎట్లన మనకు స్వబుద్ధినుపయోగించి యోచించి తత్త్వనిర్ధారణ సేయుట మహాపాపముగదా! పితృపితామహ ప్రపితామహాదులాదేశించిన విధమ్మున రెండవమాటలేక కన్ని

త్తియైనఁజూడక ఎన్నఁడో త్రిప్పిపెట్టఁబడిన గడియారము లట్లు పోవుజడులుగానవీరికిమనసులు లేవనియు వీరిదేహములతో తాత్త ముత్తాతలు పిశాచములై యావేశించి యుందురనియుఁ జెప్పిన నతిశయోక్తికాదు. చిల్లరగుంపులలోఁ జేరినవారికి స్వచ్ఛంద వృత్తి కలలోనైనఁ గన్నఁబడని భాగ్యము. మఱియు పారతంత్ర్య మలవాటగుటఁజేసి, దేశము వైరుల పాలైనను, స్వాతంత్ర్యము యొక్క సౌందర్యసంపదలను, గాంభీర్య గౌరవముల నెంత వర్ణించినను, హృదయ ప్రతి బింబితములు గాఁజాలనంత పందలు గావున, నిట్టివారికి విషాదరోషమ్ములును గలుగవు. అభిమన్యు లై దేశసేవా విజృంభణ నియుక్తులు గావలయునన్న, చిల్లర సమూహములయందలి మూఢానురాగ భక్తులను బ్రాయ్యనిడి బాగ్గులుగఁ గాల్చుట మొదటిపని ! గ్రామ్యపద్ధతి స్వాతంత్ర్యమునకు విరోధి. స్వతంత్రతా బుద్ధి రాదేని గ్రామ్యపద్ధతి యనశ్వరము. కావున దేశలాభానుగుణమైన స్వతంత్రత సర్వజన సేవ్యంబు.

## గ్రామ్యపద్ధతిలో జనులకు స్వతంత్రత లేదనుటకు నిదర్శనములు

(౧) ఐరోపాలో గృహనిర్మాణ విషయములో ముఖ్యముగా గణింపఁ బడునవి గదులు. ప్రతివారును ప్రత్యేకముగ చదువు సాముల నెఱవేర్చికొనుటకు ఒక్కొక్కరికి నొక్కొక గది నిచ్చుట వారిలో నాచారము. మనలో పూజా పునస్కా

రములఁ దక్క తక్కిన కార్యములకు అరలు దుర్లభములు. ధనికుల యిండ్ల సయిత మివి గానరావు. అందఱును మంద రీతిని గుమిగూడి చేయఁబడుచు నుండుట పెద్దల తరముల నుండియు వచ్చిన యాచారము. మనలో నంతరంగములను నవి లేవు. అన్నియు బహిరంగములే! పల్లుతోముట, మొగము గడుగుట, స్నానముచేయుట, వస్త్రముల ధరించుట, ఇవి యింగ్లాండులో పరమ రహస్యకార్యములు. మనవారిలో నన్న లక్కలు సరస విరసముల విరచించుచు కాంగ్రెస్ మహాసభ గాఁ జేయు నుల్లాసకార్యములు. ఒకవేళ ఈ హేయంపు బ్రదుకు దరిద్రత, తస్కరభయము, పిఱికితనము, వీనిచే నిలుపఁబడిన దేమో. ఎట్లును సహ కుటుంబములే దీనికిఁ గారణములు. ఇంతయేకాక నాకు వేదాంతుల తత్త్వముల మీఁదను నను మానము గల్గుచున్నది. ఎందుల కందురో. వేదాంతులు నిర హంకారత్వ నిర్మోహత్వములం జాటెదరు గదా! ఈ గుణ ముల్లు పట్టువడుటకుఁ బన్నిన యుపాయములో మనయిండ్లు? ఎట్లన మఱుఁగు మానమును లేనిది మోహములు నివ్వటిల్లవు. ర్వమును బట్టబయలుగనున్న నింతేనా యని తూలనాడి లఁగుదుము. కావున విరక్తి జనించుటకై మనకు కొట్ట ము లమర్పఁబడియెఁ గాఁ బోలు! ఈ యపహాసములతోఁ బ్రయోజనము లేదు. ముఖ్యన్యాయము లివి. మఱుఁగు మానము లొండొంటి నవలంబించి యుండును. ఒకటి లేనిచో

నింకొకటి బ్రతుకఁ జాలను. మృగంబుల కివి రెండును లేకుం టయె యిందులకుఁ దార్కాణము. జనులలోఁగూడ నెముల్ల బట్టలు సైతము సరిగా ధరింప సమర్థులుగాని యంత్యకులజులు దూషణభూషణ తిరస్కారంబులకు నెడమై జడులై యుంటం జూడ మనసులు కరఁగకున్నె? "ఇది నాది. ఈ వాక్కులు నాయవి. వీనినెవరు నుల్లఘించి రాఁగూడదు" అను నాత్మాభి మానము లేనివారికి గరువతనము గాంభీర్యము నగోచర ములు. ఈ ధర్మక్షేత్రములో తుదకు మన శరీరములైన మన విగాలి జూచు కొనుటయు నఘటితంబుగ నున్నది. ఇట్టి వారికి పోడిమి సాహసమును దీపింపఁ జాలునా? కావుననే సన్యాసి వేషము ప్రశస్తమని పేరుగనియె. ఈ రీతుల నవులం ద్రోచిన నహంకారము పుట్టును గదా యని కొందఱాక్షేపింపవచ్చును. నిజమే. అహంకారమున్న నేవరికేమి నష్టము? అహంకారము (అనఁగా గర్వము గాదు. నేను, నాపనులు, నాదేశము, అను బుద్ధి) లేమి మృగప్రాయతయే కదా! అహంకారము లేని వారు స్వర్గస్థులగుదురన్న పశుపక్షి మృగాదులు సైతము తప్పక స్వర్గముఁ బొందవలసి వచ్చుఁగదా! మనము నరత్వచ్యుతులమై కిన్నరులమో యక్షశీర్షులమై గంధర్వులమో కావలసివచ్చును. అట్టి గతికైన నరకము మేలు. అహంకారము, స్వపరబుద్ధి, యివి తమంతట హానిదములుగావు. సమూహమునకుఁ బ్రతి కూలించిన హాని. అనుకూలించిన నైనచో పౌరుష ప్రధాన

బులు గాక నమేయ శోభావహంబు లవును. నిరహంకారులగు సన్యాసుల కుండునంత యహంకారము సంసారుల కెన్నటికి నుండదు. చూడుఁడు! సన్న్యాసియొక్క మతమేమి? 'ఎవరే కడగండ్లఁ గాంచిననాకేమి? నేమాత్రము దివ్యపదవియం దున్నఁ జాలును" అని చింతించుట గదా! దీనికి నెనయైన యహంభావము త్రిలోకముల గాలించి చూచినను దొరకదు. అది యట్లుండె. దిగంబరత మేలనుటచే దిక్కులేమి సంభవించె ఇఁక నిరహంకారత్వమఁట! నిర్మోహత్వమఁట! నిత్యదారిద్ర్యమనుటకు ఇవి వేదాంతుల తర్జుమా కాఁజోలు!

చూడుఁడు! ఈ దేశముయొక్క నిరుత్సాహస్థితి వేదాంతతత్త్వముల వలనఁ గలిగినదికాదు. ఆర్థికస్థితి గతులాచారములకు మూలములు. ఆచారములు వర్ధిల్లిన పదంపడి యాకంపు నింపు చేయుటకై కల్పింపఁబడిన వ్యాఖ్యానములుఁ తత్త్వములు. ఇట్టి నీరసతత్త్వములను నిస్సారులుగాని వారెవ్వరును బాటింపరు.

(౨) మామూలుజీతములు విధులు నేర్పడియుండుట

గ్రామములో సర్వమును మామూలుచే నిర్దిష్టము. కూలి మామూలుకూలి. మేరలు మామూలు మేరలు. దానికిఁ దగినట్లు పనియు మామూలునిద్రతోఁ జేయుపనియే. స్పర్ధ, మాత్సర్యము నను నవీనగుణమ్ములు పారంపర్య మను ప్రాకారమును దాఁటి రానేరకున్నవి. కూలివాండ్రు మెండైన జీతములు

తగ్గవు. అరుదైన హెచ్చవు. బ్రిటిష్ గవర్నమెంటువారిచే నూతనోద్భూతములైన, బాట, రైలువంతెనలు, ఇత్యాదికార్యములలో జీతములు పురాతన వేతనములకన్న నధికములుగఁ జేయఁబడినను, తన్మూలమున గ్రామములలోని కర్మకరులభరణమంతగా నుత్కటము గాలేదు. స్పర్ధలేమియు, నాచారగ్రస్తతయుఁ గారణములు. అయిన నిందొక మంచి లక్షణము. వృద్ధిలేకపోయినను హీనత లేదు. స్పర్ధాపూరితములైన దేశములలో శక్తిగలవారు తేలుదురు. లేనివారు మునుఁగుదురు. మనలో రెండును మితిమించిపోవు. ఎంతదక్షులైనను కుమ్మరి, కమ్మరి మొదలైనవారు ధనికులౌట యప్రసిద్ధము. ఎంత యపకృష్టులైనను, ఏమియు గడింపక పోవరనుటయు సిద్ధము. జరాభారముచె క్రుంగి యేమియుఁ జేయలేకయున్నను కరుణాత్ములిరుగుపొరుగువారు వారిం గూడఁ జీర నిచ్చి యుద్ధరింతురు. ఇదెంతయు నానందకరంబైన యాచారము! పూర్వానివేదితములైన గ్రామములు ప్రత్యేక రాజ్యములవంటివను న్యాయమునకిది యొక నిదర్శనము. ఏకరాష్ట్రీయులెట్లు పరస్పరోద్ధరణక్రియాపరాయణులై యుందురో, ఆరీతి నా గ్రామ్యజనులుఁ దమయూరివారి యెడ వర్తింతురు. ఆహా! గ్రామ్యధర్మమునందుపగతమైనబుద్ధి దేశ్యధర్మము నవలంబించి ప్రసరించెనేని ఎంత తేజోవంతముగా నుండును! ఇట్లు ప్రసరింపక పోవుటకు గ్రామ్యబుద్ధితో నెట్లో సంకలితమై దానిని గుందింపంజేసిన

కులబుద్ధియే నిందాపాత్రము. ఇవి రెంటికింగల పరువేదియనిన గ్రామభక్తి దేశభక్తివలె స్థానము ననుసరించి యుండును. జాతులెట్లుండినను ఏకగ్రామనివాసులు స్థానబాంధవ్యముచే మనవారని తెలిసికొందురు. కావుననిది యేకీభావమును జనింపఁజేయు గుణము. మఱియెంతయుఁ బ్రశంసనీయము. కులభక్తి యిట్టిదిగాదు. పరస్థలముల నివసించుచు ముక్కుమొగముల నెన్నఁడెఱుంగనివారును సంతతి ననుసరించి యన్యోన్యముగాఁ బరిగణింపఁబడుటయు, ఇరుగుపొరుగువారలయ్యు జాతిసామ్యము లేనిచో పరులని వెలితిగఁ జూడఁబడుటయు దీని మాహాత్మ్యము. కావున నిది దేశదారిద్ర్యమునకును, ఐకమత్యాభావమునకును, ముఖ్యకారణము. ఉత్పాతబీజము. స్థానానుగతములైన భావములు సముచ్చాయకశక్తులు, తదితరములు విచ్ఛిద్రశక్తులు. మనదేశములో జాతి, మత, వేష, భాషాదులు విచ్ఛిద్రశక్తులనుటకుఁ గొంకనేల? సముచ్చాయక శక్తియైన దేశానురాగము మాటలఁ దలంపులఁ గోరికలం బొడసూపెడుంగాని మనదేశమున నింకను గొందఱియందుఁ దక్క చదువుకొన్నవారియందైన ననుష్ఠానమున సామాన్యముగ నుదయించినదిగాదు.

గ్రామ్యకుల పద్ధతులు మన సుఖదుఃఖముల కన్నిఁటికి నుత్పత్తిస్థానములు, నెల్లలును గావున విపులముగ జర్చింపవలసివచ్చె. అయ్యవి యీ దేశమునకు దల్లివ్రాతఁ వంటివి.

దేశపద్ధతి యిప్పుడిప్పు డక్కడక్కడ మొలకెత్తుచున్నది. ఇది విజృంభించి వైరి పద్ధతులం గీటడంచి వ్యాపించినంగాని దేశమున మన మానప్రాణంబులు రక్షితంబులు గావు.

(3). ఉత్తరువుల మేరకు శిల్పులుత్పత్తి సేతురుగాని యిప్పటి యట్ల గిరాకి నెదురుసూచి సరకులం దయారుచేయరు. కారణము స్పష్టము. సమగ్ర వాణిజ్యము గల దేశములో నెవరైన, తుదకు పరదేశముల వారైనం గొందురను నాశనై వర్తకులు వస్తువులం దయారుచేసి గ్రాహకులకై నిరీక్షించుచుందురు. వర్తకులకు బేరసారములు పొటకరిల్లి యుండుటంజేసి సాధారణముగ నష్టమురాదు. గ్రామములు చిన్నవియు క్రయవిక్రయము లంతగా లేనివియు నౌటంజేసి నిరీక్షింపం బడని వారెవరైనవచ్చి కొందురనుట యబద్ధము. కావున కుమ్మరి కమ్మరి ఇత్యాదులు అర్థులను నిరీక్షించి కుండలు కొడవండ్లు ప్రోగుచేసిన నాస్తి చేరుటయేమో కాని యార్తి యగుట తప్పదు. ఇపుడు నగరములలో గిరాకి దారులు వినిశ్చితులు గాకున్నను విపుల వ్యాపార ప్రదేశములు గావున లాభాపేక్షచే సాహసించి యంగళ్ళలో నన్నివస్తువులను నింపెదరు. ఈ సాహసమున కాశ్రయ మేదనగా - రామస్వామి, అయ్యాసామి, వీరు, వారు-అను నికరమైన పుణ్యాత్ములు రాకయున్నను, సరాసరికి ఇందఱు జను లేయనామధేయులో వచ్చి పదార్థములం గొందురను నమ్మిక. పల్లెటూళ్ళలోం గొనువారు ప్రముఖులుగొందఱె. వీరు కొనం లేని సరకులు కుళ్ళ వలసినదే. బేరసారము లత్యల్పములు గాన సరాసరులం

దోషమున్న సంసారము బహురాజకమగును. బహురాజకమరాజకమున కన్న నతిదుష్టము. కావున నింగ్లాండులో నేకపత్నీవ్రతము చిరస్థాయి యయ్యె.

గ్రామ్యపద్ధతి నుద్ధరించు కారణములు.

ఈ దేశమున స్త్రీల దాసత్వము, గ్రామ్యపద్ధతియు నన్యోన్యశరణ్యములు గావున నివి యథాక్రమముగ నేకకాలమున నస్తమించుంగాని యొకటిపోయి యొకటి యుంటిగ నిలువనేరదు. గ్రామ్యవ్యవహారము కడు బాలిశమనువారు నారీజనుల స్థితి నుత్కృష్టముగ నొనర్ప నుద్యుక్తులుగావలయు. స్త్రీ దాసత్వమీయార్థికస్థితికి ప్రథమపాదము. తక్కినవి యెవ్వియన:—

(౨) రాకపోకలులేమి:—ఇది వాణిజ్యవ్యాప్తికి ప్రతిఘాతకరము. వాణిజ్యము లేనిచో సర్వమును దమకుదామ సన్నాహ పఱుపవలయును.

(3) దారిద్ర్యము :—మృగయాయుగమ్మున బీదతన మతినిబిడమ్ముగ నుండెననియు, తదితరయుగమ్ముల క్రమేణ తఱుగుచు వచ్చెననియు ముందే మందలించితిమిగదా! దీనికిం గతంబెయ్యది? తమకు వినియోజ్యములగు వానినెల్లఁ దామే సేకరింపవలయునన్న నెక్కువ ప్రోగుచేయుటకు భీమ బలునికైన నలవిగాదు. వస్త్రముల నేయుట, బట్టలుతుకుట, పంటఁ బెట్టుట, వంటచేయుట, ఇల్లుగట్టుట, అందులకుఁ గావలసిన ఊదురులు, పూరి మన్ను, ఇత్యాదులను దయారుచేయుట వీని

నన్నింటి నొకండే ఇతర జన సహాయము లేక పరిష్కరింపఁ బూనె నేని కల్పాంతమున్నకైనఁ బనిముగియదు. ఒక పూటకైన రుచి కరమగు భుక్తిలభింపదు. మనుష్యులలో నెల్లరు సుఖముగ నుండవలయునన్న సంఘమున నన్యోన్యత యుండవలయు. భిన్న వృత్తులుగాని ప్రజలున్న నన్యోన్యత యుండదు. కావున వేఱు వేఱు వృత్తుల నేర్పఱచి ఒక్కొక్కరు ఒకటింబూని పరిశ్ర మించి, విశేషధనమ్ముల నార్జించి, వాణిజ్యముచే నొండొరుల కొఱంతలఁ బూరించిన కార్యసిద్ధి యగునుగాని వృత్తివిశ్లేష ణము లేనిచోఁ గాదు. సంఘ ముద్ధరమగుట కేమి సాధనం బనిన:—వృత్తులు విశ్లేషించి వాణిజ్యముచే సంశ్లేషించుట. ఇది యథార్థతత్వము. ఈ విశ్లేష సంశ్లేషములు పరస్పరా స్పదములు.

## వాణిజ్యోత్పత్తి లితరేతరాశ్రయములు

వాణిజ్యము లేనిచో విశ్లేషము దుర్ఘటము. సాలెవాఁడు తన బట్టలకు మాఱు బియ్యమును గొనవచ్చునను నిశ్చయ ముండఁబట్టి కాదె బట్టలనేయును! లేనిచో పంటలను బెట్టవల సిన వాఁడగును. ఇఁక విశ్లేషణ లేనిది సంశ్లేషణ యంతకు మున్నె మొనయదు. విశ్లేషణము ఉత్పత్త్యతిశయమునకు మూలము. ఉత్పత్త్యతి శయముచేఁ గావలసిన దానికన్న నెక్కువ కర్తలకు నమరును. ఈ యధికములగు బండములే వాణిజ్యపు సరకులు.

వృత్తులు విశ్లేషింపవేసి యుత్పాదకశక్తి లఘువగు ననియు, ఈ విశ్లేషణము, నిరాతంక వాణిజ్య సంశ్లేషణము, నితరేతర పోషణములనియుఁ జక్కఁగా గ్రహింపవలసిన విష యము. వాణిజ్యము పెఱుగుకొలఁది నుత్పత్తి యధికము గావలసివచ్చును. ఉత్పత్తి యనర్గళము గావలయునన్న శ్రమ విశ్లేషణము, నధికముగ నుంట యావశ్యక కృత్యము. శ్రమ విశ్లేషణము విషయమై ఇఁక ముందింకను వ్రాయఁబడును.

గ్రామ్యవ్యవహారములవలనఁ గలుగు కీడులు

(౧) ఆచారాద్యఖిల పాశబద్ధు లౌట.

(౨) రాకపోక లల్పము లగుట.

(3) వాణిజ్యహాని.

విలుచుట కనువులేనిచో నెక్కువగ నుత్పత్తి చేయ నెవరు పూనుదురు? ఎక్కువగా నుత్పత్తి లేనినాఁడు వృత్తులు విశ్లేషించుట కవకాశము తక్కువ కావుననే మన యిండ్లు సర్వ కర్మములకు నాకరములై శిల్పశాల లట్లుండుట! మఱియుఁ గొన్ని కార్యములకుం బూనక యన్నింటికిం దొడరిన నార్జన మచ్చికవడు, నను న్యాయము ప్రకారము విశ్లేషణములేనిది దారిద్ర్యము తుద ముట్టదు.

కావున మనగతి యెట్టిదనిన:—దారిద్ర్యముచే విశ్లే షణ వ్యాపింపకున్నది. విశ్లేషణ తఱుచు లేమి దారిద్ర్యము వదలకున్నది. ఇవి యన్యోన్యాశ్రయములు గాన, నశించిన

రెండు నొకటిగా నశించును. అనగా ఆధ్యత, వాణిజ్యము వలయునేని చిల్లర మల్లరలెల్ల నాశ్రయించుటమాని యేదైన నొక వృత్తి నవలంబించి తద్వారా ఇప్పటికన్న నెక్కువగ సంపాదించి జనులు సుఖభాక్కులు గావచ్చును.

భిన్నవృత్తులు

నానాటికి జనుల కేకవృత్తిప్రాప్తి యింకను లేక పోయినను గొంచెమైనను వృత్తులు విభక్తము లయిన వనుట నిక్కము. మృగయా యుగమునందును స్త్రీపురుషులు భిన్న ప్రవృత్తులయి యుండిరి. వంటపని స్త్రీలయది. వేట పురుష సామ్రాజ్యము. పశుపాలనా యుగమునందు భిన్నత యింకను ప్రబలమాయెను. యజమానులు, పనివాండ్రు, చర్మకారులు, కంబళ్లు నేయువారు, పాలు, పెరుగు, వెన్న, జున్ను, వీనిచే గాలము గడుపువారు, ఇట్లు జనులు బహుమార్గగతులయిరి. వ్యవసాయ యుగమునందు ఆర్థిక కర్మమను మహానది చీలినదై యనేక సంఖ్యాముఖమ్ములతోఁ బ్రవహించి లోకోపకారిణి యాయెను. అప్పుడు పుట్టిన శిల్పులు వడ్రంగి, కుమ్మరి, ఇత్యాదులు. మరియు జనులు నారదునట్లు సంచారపరాయణులై యుండుటమాని స్థిర నివాసాసక్తచిత్తులై యున్నందున పల్లెలు, నగరములును నేర్పడెను. సంఘములుగఁ జేరి యొకరితో నొకరు కలసిమెలసి మాటలఁ జర్చలఁ బరస్పరాభివృద్ధివడసి నందు వలననేయభివృద్ధికి నాగరకతయను పేరుగలిగె. నగరము.

లలో నవతారమెత్తిన నవవిలాసిని నాగరకత. ఇట్లు వ్యవసాయ యుగము తత్పూర్వస్థితులకన్న మించి మెట్టెక్కిన దగుట, అలంకార క్రియ లుత్పన్నములై కంసాలి, చిత్రకారులు మొద లయినవారికి నాలవాల మయ్యెను. హిందువులు మొత్తము మీఁద నీ స్థితిలో నిప్పటికి నున్నారు.

## క్రియా పరిచ్ఛేదము

ఇంకను ఘనతఁగాంచిన పాశ్చాత్యులలో వృత్తులు వేఱుపడుటయకాదు, ప్రతివృత్తికిం జేరిన భిన్నభిన్న క్రియ లును ప్రత్యేక వృత్తులం బోలి యున్నవి. దృష్టాంతము:— పొలము కాపు, పంటపండిన తోడనె, గింజలను రాల్చి యమ్మి వేయును. తనకు ధాన్యముతో నెక్కువజోలి లేదు. వాని నెండఁ బెట్టి, యంత్రములచేఁ బొట్టు దీసి కొన్నవారు పిండిచేయు వారి కమ్ముదురు. వీరు పిండిసేసి రొట్టెలవానికి విలుతురు. పొలము కాపువాని యొద్దనుండి రొట్టెలగాని కుటుంబ భరణ కార్యము నెరవేర్చును. ఈ దేశములో నీక్రియలన్నియు ౧టిపనులు. కావుననె వారికి మనకుంగల తారతమ్యా ర్యధికము. మనము వారలట్లుండుటకు నిదితరుణము ౦దు. తాదృశ మార్గావలంబనకు దారిద్ర్యమొక నిరోధక ముగా నుండును. మఱియు, ధాన్యము నమ్మి మనము కాలమును మిగిల్చితిమేని ఈకాలమును వ్యర్థపుచ్చక విని

యోగించుటకు వారలయందుఁబలె మనలో శక్తియు, రక్తియు యుక్తియు, నవకాశమును లేవు.

## గ్రామ్యపద్ధతి స్వాతంత్ర్యర్గళము

ఇంకను గ్రామ్యవ్యవహార లక్షణముల వెల్లడిసేతము. కులము, గ్రామము మొదలగు చిల్లరసమూహములే శరణమని యుండు వారికి స్వతంత్రత సంపూర్ణముగ సున్న. ఎట్లనిన:—

ఎప్పుడెవరేరీతి నెత్తినత్తురోయను భయమున వడవడ వడఁకుచుండు పల్లెటూళ్ళలో సైన్యమునందుఁబలె ప్రతివాఁడును నియత పద్ధతులం బూనవలయుఁ గాని స్వేచ్ఛావిహారుఁడౌట పొసఁగదు. 'త్రిమూర్తులకన్న నల్పదేవతల యధికారము జాస్తి' యన్నట్లు సమూహమెంత చిన్నదియో దానిచే చెలాయింపఁబడు తనికీ యంత మిక్కుటము.

"గంగ పాఱుచుండుఁ గదలని గతితోడ, ముఱికి కాల్వ పాఱు మ్రోఁత తోడ"నని వేమన యానతిచ్చినట్లు ప్రధాన మంత్రులకన్న గ్రామపంచాయతీదారుల ధాటి కడుదట్టము. కలకత్తాలోని గవర్నర్ జనరల్ గారికి మన మే పోకలఁబోయిన నేమి? మఱి మనచర్య లిటువంటివనియైన నెఱుఁగుదురా? ఎవరైనఁ జెప్పవచ్చిన నాలకించుట కవకాశముగాని యభిలాషము గాని యుండునా? రాజశాసిత విధులఁ దీర్చినచోఁ దదితరముల నేమిచేసినఁ జేయకున్న వారికేమిచింత? ఊరి పెద్దలు కులపుఁ బెద్దలును 'పిట్టచిన్నదియైనను కూతపెద్దది" యన్నట్లు ప్రతి,

గొలుచుట పిచ్చితలంపుగాపున దొలుత నుత్తరువుల జెంద నద్వావస్తురచన కెవ్వఁడుఁ దొడంగఁడు. వాణిజ్యము కృషి శిల్పాది కళలును, అర్థమను మహారథమునకు చక్రములవంటివి. రెండును సమముగఁ బోవునవికాని య్యొకటి కాశివద్దఁ దిరుగుచున్న నింకొకటి రామేశ్వరము నొద్ద మసలుట ప్రకృతివిరోధము. వాణిజ్యము విస్తృతమైనఁ గళాచక్రము యథాక్రమముగ విరివిగాంచుచును. గ్రామపద్ధతియందు రెండును హ్రస్వములును నలక్ష్యములునై యున్నవి.

(ఠ) పైవానిలో నెల్ల గలిసిన యంశమింకొండుగలదు. అదేదన, ఇట్టి స్థితిచే జనులేఁ రీతిని పురాణ సరణి నుండి దే కాని నూతనములైన యూహాలు, కోరికలు, ఉద్యమములునుం గలలోనైనఁ గాన నేరరు గ్రామ్యపద్ధతి జడపద్ధతి. వికాసవిన్యాసములకు వీలులేదు. ఎట్లన. నవీన కాంక్షలుండెబో, తత్పరిహారకములగు వస్తుపుంజంబులుండుట దుర్లభము. దుర్లభములును నదృష్టములు నగోచరములునైన వానియెడ మరులుగొని పలవరించి ప్రయత్నించుట మనుష్యులకు నసహజము. మఱియు వాంఛ లుత్కటములు గావేని ఉద్యోగములు విజృంభింపవు. ఈకారణములచే వస్తువులు లేమి వాంఛలు, వాంఛలు లేమి నుపార్జనములును సన్నఁబడి జనులనభివృద్ధి నందనీక నికృష్ట స్థితి పాత్రులం జేయును. విధిలేక మితమనోరథులై యుండు వారికి వేదాంతము బయలుదేరి "మితస్పృహులై యుండుఁడీ" యని యప్రయోజకోపన్యాసముం జేయుటఁ జూడ నెవ్వరికినవ్వురాదు? తిండిలేక చచ్చువారికి, ఉపవాసవ్రత మాదేశించినట్లు.

---

# రెండవ ప్రకరణము

## వృత్తుల పరిణామము

### ఇతర పద్ధతులు

శ్రేణిపద్ధతి :—

గ్రామపద్ధతి కానంతరికమయ్యు నద్దానితోఁగాని భేదమేర్పఱచుటకుం గష్టమైన శ్రేణిపద్ధతి యనునదొకటి గలదు. శ్రేణియనఁగా నేకవృత్తులయిన శిల్పులు స్వరక్షణ లాభమ్ములకై సమయకల్పనలతో నిర్మించుకొనిన సంఘము. ఇట్టివి యూరోపుదేశమందుబలె హిందూదేశమందంత ఖ్యాతికి రాలేదు. ఎందులకన:- మనలో కర్మలు జాతులలో నుపగతములై వర్ణములుగ మాఱినవి. మంగలి, చాకలి, కమ్మరి, గొల్లఁడు, ఇత్యాద్యసంఖ్య కులభేదములు వృత్తి వ్యత్యాసా విర్భూతములనుటకు సందేహము లేదు. కావున శిల్పశ్రేణులకుఁ బ్రత్యేక జీవనము లేకపోయె. శిల్పములు జాతులలో నావేశించిన వగుట వ్యవహారకుల ధర్మములు ఐక్యముండెందె. ఈ పావన భూమి గాలిసోఁకినంజాలు. అన్నియు జాతులౌను! వర్తమానమున జాతిభేదము లనుచితములని వాదించుకొందఱు నిర్భేద

జాతియనునొక నూతనజాతిగా నేర్పడునట్లు తోఁచుచున్నది! పెక్కు మొగములుగఁ జీలి ప్రవహించు గంగానదింబోలె నామెను గొలుచుమనమును ఖండఖండములుగా వ్రేలైయుండుట యేమిచోద్యము? మనగతి తెల్లఁబాఱినది. దానిమాటయేల? యూరోపులో వ్యావహారిక వార్థములు భిన్నజాతులుగా లేదు.

## శ్రేణుల ముఖ్యలక్షణములు

కూలివారి వలెంగాక శైల్పికులు ఉపకరణములు, కచ్చాసామగ్రులు మొదలగు సాధనకలాపమునకుఁ దామే సొంతగాండ్రై యుండియు, గ్రామ్యపద్ధతియందుంబలె మితవ్యాపారకాలముగావున నుత్తరువులంబొందియే సరకులఁదయారు సేయువారై యుండిరి. కూలివారికిని శిల్పులకును భేదమేమన్న, కూలివారు పొలములలోఁ బనిచేయువారివలెఁ గొఱముట్లులేనివారు. సన్నాహముల నన్నిటిని యజమానులే చేయవలయు. శిల్పులన్ననో సాలెలు, వడ్రంగులు, మొదలైనవారింబోలె దడు. ఆయుధములు, నూలు, కొయ్య, ఇవన్నియు వారికిం జేరినవె. గిరాకిదారులచే నీఁబడునవికావు. కంసాలులు ఈ రెండువిధములను జేరక మధ్యమరీతులుగా నున్నారు. పరికరములు వారివేయైనను పక్వపఱుపఁబడు బంగారు రత్నములునాజ్ఞాకరులచే నియ్యఁబడియెడు నవియే.

పరులు పోటీకి వచ్చిన నుండునదియుఁ బోవు నేమో యనుభీతిచే తమచక్రమున నితరులురాఁగూడదనియు అందులకు

(౧) యజమానులును లాభనష్టములకుఁ బాత్రులు నైన భాగస్థులలో నందఱో కొందఱో యావేశనముననే పనికిఁ గుదురుట.

(౨) భాగములు గలవారుగాకపోయినను శ్రమకరులు గూడ కూలిగాక లాభములో నొకపాలు వడయువారుగను, ఆవేశనము నడుపు నాలోచన సభయందుఁ జేరినవారుగను నుండుట.

ఈ లక్షణమ్ములు చక్కఁగఁ బట్టువడియె నేని సామాన్యమైన వ్యవహారసమాజములయందలి దోషములు పాయును. ఎట్లనిన :—

(౧) శ్రమకరులకును యజమానులకును గాఢమైన సంయోగము సిద్ధము. కావున వీరిలో వీరికి వైరస్యము సంభవించుటయు, కర్మోపహారము మొదలగు నాపదలు పుట్టుటయుఁ దొలంగును.

(౨) ఆవేశన తంత్రంబున భాగస్థులు తూఁగుబోతులుగానుండక యజమానత్వము సార్థకముం జేతురు. యజమానులలో ననేకులు శ్రమకరులును నగుటంజేసి చోదనశక్తి యులవడినవారై కార్యంబుల స్వబుద్ధితో నేర్చి తీర్పఁజాలుదురు.

(౩) సామాన్య సమాజములలో నావేశనముండుచోటు ఒకటి. ఇఁక భాగస్థులన్ననో దిక్కుదిక్కులనుండియు రావచ్చును. ఇంగ్లాండులో ప్రబలములైన కంపెనీలలో ఇండియా

మొదలైన తూర్పు రాజ్యములవారును భాగములఁగొన్నట సర్వ సాధారణమైన క్రియగానున్నది. నిర్మాతలయొక్కయు చోదకులయొక్కయు నాశమును పరున్నునుజూచి యీ వ్యవహారముల స్వరూపమునైన నేమాత్రము నెఱుంగనివారు సైతము మూలధనము నిక్షేపించుట మిక్కిలియు వ్యాప్తమైనవాడుక. ఈవిశ్వాసము కొంత్తముమీఁద నుచితమైనది. వ్యవహార సమాజములయొక్క యఖండమైన వృద్ధియే యిందులకుఁ దార్కాణము. సమిష్టిక బేహారములకన్న మోసఁపు వ్యాపారములు ఘనతఁగాంచునా? వానిలో నెవరైనఁ దమసొత్తులను బ్రయోగింతురా? కొంత్తముమీఁద సమాజములు విశ్వాస యోగ్యములయ్యెను, భాగస్థులెక్కడనోయేమూలనోయుందు వారు గావున చోదకులు సర్వస్వాతంత్ర్యమును వహించి యడుగువారు లేరుగదా యను ధైర్యముచే నిశ్శంకముగ సామాజకులను బ్రజలను వంచించి యర్థముల దోచుకొనుటయు లేకపోలేదు. అన్యోన్యతా పద్ధతియందట్టి యకృత్యముల కవకాశము తక్కువ. ఏలన, భాగస్థులు కార్యవిచారణాది కార్యముల సమర్థులగుటంబట్టి.

(ర) అన్యోన్యతా పద్ధతియందు మఱియు నొక గుణము గలదు. కొంతకుఁగొంత పరిచయముగలవారు చేరి చేసినంగాని యీపద్ధతి బాగునకురాదు. అట్లగుట నమితములైన మూలధనములనేకరించుట దుర్లభము. సామాన్యసమాజములలో లోక

స్థులెల్లరును భాగములఁ గొనవచ్చును. దాన బాధలేదు. కో ఆపరేషన్ సమాజములలో నిది పొసఁగదు కావున వ్యవహార ములు సాధారణ సంఘ సాధితములయంత విస్తారముం జెంద వు. చుట్టుప్రక్కల స్థలములవారు దక్క నితరులు చేరిన నన్యోన్యత నశించును. కావున నిట్టి వ్యాపారములు మితవ్యా ప్తికములు. మితములైనను నిఖరమైన వాడుక కాండ్ర సమూ హము నవలంబించి యుండునవిగాన స్థిరతరములు.

(౫) శ్రమకరులును కొంతమట్టునకు యజమానులతోఁ దుల్యులుగ గణింపఁబడుదురు కాన వారు శ్రద్ధతోఁ బనులం గావింతురు. మేస్త్రీలు మొదలగు విచారణ కర్తల నియమింపఁ గారణము లేనందున సెలవు మిగులును.

సిద్ధాంత మిట్టిదయ్యును ననుభవమున కో ఆపరేషన్ సంఘముల యందును లోపము లనేకములు గన్పట్టెడిని:—

(౧) శ్రమ కరులకు యజమానత్వ మిచ్చుట "కనకపు సింహాసనమున శునకముఁ గూర్చుండఁబెట్టి పట్టము గట్టినట్టు" లగును. గొప్ప బుద్ధియు దీర్ఘాలోచనయు లేనివారు గావున తగిన కార్యచోదకుని నియమింపఁజాలరు. మంచివానిని సమ్మ తించి ప్రతిష్ఠించిరిబో! తఱుచు వానిపైఁ గన్నుంచి "ఇట్లు చేయవలయునట్లు చేయవలయు" ననితామే యాదేశింపఁదొడంగి కార్యంబుండిన్నఁగ జఱుగనీరు. మఱియు చోదకుఁడు తమ యం దలి తప్పులంజూపి శిక్షించెనేని "మనచే నియమితుఁడైన వాఁడే

ఘనల్ని దండించు వాఁడాయెనే! రాఁగల వత్సరమున వేఱొకనికి, ప్రభుత్వమిత్తుమని మరహంకారముఁగొనుటయు నరుదుగాదు. దండ నీతి ప్రవర్తింపలేని యరాజకము సాక్షాత్కరించును.

(౨) ఈ కాలమున బుద్ధి బలము మిక్కిలి ముఖ్యమైన వ్యవహార సాధనమ్మనియు నమూల్యమనియు మున్నే తెలిపితిమి గాదె! లక్షలకొలఁది సంబళము లొసఁగి కళాకోవిదులఁ దమ తమ పక్షము వారిఁగాఁ జేయు సమాజముల వారు స్పర్ధింతురు. అన్యోన్యతా సంఘములలో శ్రమకరుల కింకను జ్ఞానశక్తి యొక్క విలువ తెలియనట్లున్నది. చోదక పదవికి నెత్తఁబడిన వానికి జీతము లెక్కువగ నిచ్చుట యింకను వారలలో నాచారమునకు రాలేదు. సంబళముతో సరిగ పనియు జబ్బే. అత్యంత సమర్థులు వేఱెడలకుఁ బోదురు. మొత్తము మీఁద కోఆపరేటివ్ సమాజములలోని కార్యవిచారణకర్తలు ప్రథమ గణ్యులుగారు. మిక్కిలి నిపుణుల నాకర్షింపఁ జాలినంత వేతనముల నిచ్చు బుద్ధి వానికున్నఁగాని యవి ముందునకు రావు. “మనము చెమటగారునట్లు దినమంతయుఁ గష్టించుచున్నాము. మన యజమానుఁడేమి చేయును? ఒక మూలలో పిళ్ళారి మాదిరిఁ గూర్చొని కాగితములఁ ద్రిప్పుచు చుట్టగాల్చుచుండుటయే కదా యతనిపని? ఇందులకా యతనికి నెక్కువ జీతమిచ్చుట?” యని శ్రమకరులు వాపోవుదురు కాఁబోలు? పాపము

విద్యాగంధము లేనివారు! మన శ్రమయొక్క స్వభావము జ్ఞానాంధులకెట్లు గోచరించును?

(3) చిల్లర వ్యాపారములలో జయము ద్రాల్చునది క్రొత్తైదైై వానియందు వ్యాప్తికిఁ గాలక్రమేణ వచ్చుచున్నదనుట నిజమే యైనను మహా వ్యవహారముల నీ పద్ధతికిఁ జోరవ యింకను లేదు. అయినను నీ పద్ధతి నిస్సంశయముగ గౌరవింపఁదగినదే. ఎట్లన:-

(౧) ఆర్థిక మండలము నందలి సమస్త వైషమ్యములకు నియ్యది విఱుగడ.

(౨) విద్యాభి వృద్ధులు మించుకొలఁది దీనియందలి దోషంబులు సర్వనసానమునొంది గుణంబులు మాత్రము నిలుచును. ఈ మార్గమింకను నారంభ దశలోనున్నది. బాల్య చాపల్యము త్వరలో వీడును. పిండు జవ్వనము వచ్చు తఱికి నియ్యది నిష్కల్మష తేజో విరాజితంబై లోకంబుం బావనంబుం జేయును.

(3) పరోపకారంబు సహజముగ లీనమైన హృదయము గలవారికి నీ పద్ధతి పరమాశ్రయంబు. ఈ కాలమున స్వలాభాపేక్షయను తాపమ్మున నెల్లరు దహింపఁబడి యెదరు. బొమ్మలు మొదలైన వానిని తండ్రి యింటికిఁ దెచ్చినతోడనే 'నాకే యిందు, నావేయివి, నీవి కావు, దూరముగాఁబో' యని కొట్లాడుచు నాట్లాట మఱచు పసిపిల్లల మాడ్కి లోకము.

వారు సంపదల విషయమై మోఘ వైరంబుండాల్సి యొక్క యెదుటి వారి సుఖము నేగాక తమసుఖమును సైతము వేళింపం జేయుట చూడఁగా మనుష్య పదవి నుండువారికిని నిట్టి వెఱ్ఱి యెత్తున్నాయని యాశ్చర్యమును దుఃఖమును గలుగక మానవు! మనుష్యులు జ్ఞాన సంపన్నులై రేని ఈ వెఱ్ఱి తనంతట వదలును. అపుడన్యోన్యతా పద్ధతుల నెల్లరు సహజకాములై యవలంబింతురు. ఇఁకముందుఁ గృతయుగమును గనిపించి పోషించు మాత యీ పద్ధతియేయని త్రికరణశుద్ధిగ నమ్మువారు కొందఱున్నారు. వీరికి నిదియే నీతి ధర్మము, మతము సర్వమును!

(౮) భావిని దీనిం జెందఁబోవు మహాభ్యుదయమునకు సూచనమోయనునట్లు కొన్ని వ్యవహారముల నిప్పటికే యన్యోన్యత ప్రబలమై వచ్చుచున్నది. ఈ వ్యవహారముల చారిత్రము శీఘ్రముననే వివరించెదము.

మీఁదఁ జెప్పిన విషయములన్నియు సర్వ సంపూర్ణమైన పరస్పరతా వర్గముయొక్క ధర్మములు. ఇట్టి వర్గములు తఱుచు గానరావు. కాని, యీ ముఖ్యాంశ ములయందుఁ గొన్నింటి మాత్రము స్వీకరించిన యసమగ్రపద్ధతు లనేకములు గలవు. అపరి పూర్ణములైన యన్యోన్యతా విధానములలో ముఖ్యము లెయ్యవియనిన:—

(౧) లాభ భాగము:—కర్మశాలాధిపతులు తమ శిల్పులకు వేతనము లిచ్చుటగాక వచ్చిన లాభమునందొకానొక

వంతు పంచిపెట్టుట. ఇంతేకాని సేవకమండలి నెట్టి యాధికార మును స్వామ్యమును మృగ్యములు.

ఈరీతివలని ఫలంబులు:- కారయిత కర్మకరులిరువు రును లాభాధిక్యమందాసక్తి గలవారగుదురు గావున వారల లోఁ గలహాము లంతగాఁబుట్టవు. శిల్పులును మనసుంచి కష్టింతురు. మఱియునిట్టి శాలలలో స్థానము లలవడిన మేలుగదా యని నిపుణులైన పనివారువచ్చి చేరుదురుగాన కార్యములు నిండుఫలము నొసంగును.

(౨) నష్టభాగము:- కొన్నియాావేశనములలో శిల్పు లకు లాభమునందొక భాగమిచ్చి నష్టమువచ్చెనేని వారును నొకవంతు భరించునట్టుచేతురు. ఇయ్యది పనివారికి సమ్మత మైన తెఱంగుగాదు. తమకు యజమానత్వము లేమింజేసియు, నష్టము కొన్నిసమయముల నకస్మాత్తుగఁ దటస్థించు కారణమ్ము లవలననేగాక యజమానుల బుద్ధిహీనతవలనను వచ్చుట ప్రసి ద్ధముగావునను శ్రమకరులు నష్టమునకుం బాధ్యులౌట కొడం బడమి సహజము. అట్లునష్టమును భరింపవలయునయేని కార్య మును భరించుటలో తమకు హాక్కునియ్యవలయునని వారి వాదము. నష్టభాగమనుష్ఠానములోనున్న శిల్పశాలలో కాల క్రమేణ శిల్పులకు యాజమాన్యమునఁ బ్రవేశముగల్గు సరణి యున్నదనుట స్పష్టము.

(౩) సంఘీయసముత్థానములు:- అనఁగా నల్పమూల్యములైన చిల్లరభాగముల నేర్పఱచుకొని శ్రమకరులనేకు లేకీభవించి స్థాపించెడు కంపెనీలు కొన్నిగలవు. అయిననిందొక్కవిశేషము. కార్యకర్తలుగా నియమింపఁబడినవారికిని దమకును మనస్తాపములు గలిగి సంఘము శిథిలమగునోయను శంకచే దానియందు భాగస్థులు గానుండుశిల్పులు, అందు పనికిఁ గుదరక యితరశాలలలోఁ బ్రవేశించి కూలిసంపాదించికొందురు. శిల్పులొకశాలలో నొకవిధముగఁజూచిన సేవకులుగను వేఱొకవిధముగఁజూచిన యజమానులుగను నుండిన కార్యము పొందికగా జఱుగుట కష్టసాధ్యమని పూర్వమే వివరించితిమి. ఈయిక్కట్టులు లేకుండుటకై యొకశాలలో భాగములు గొని యింకొకశాలలో నౌకరులుగా శిల్పులుచేరుటయుఁ గలదు. యజమానత్వముండుచోట దాసత్వము, దాసత్వముండుచోట యజమానత్వమును లేనిపద్ధతి యిది.

శ్రమకరులు మూలధనము వినియోగించి భాగస్థులై యొడయులై యుండుదురను నొకవిషయమునందప్ప తక్కిన విచారములనెల్ల నీసంఘములు సామాన్యములైన కంపెనీల కరణి నుండునవి. నిర్మాణముంబట్టి చూచిన వీనికి భేదమింతయుంగానము.

(౪) కొన్నిసంఘములలో శ్రమకరులు మూలధనము నిక్షేపించి భాగములు గొనువారు కాకపోయినను, గార్యతం

త్రంబుల యజమానులట్లు తామును నాలోచనఁజెప్పి తమ సమ్మతి వెల్లడిపఱచు హక్కుగలవారు గానున్నారు. ఇట్టిసంఘములలో నాయకులకు, సేవకులకు నెడతెగని సంయోగము సిద్ధము. మఱియు శక్తికొలఁది బదవుల నందవచ్చుఁగాన నెల్లరు మహోత్సాహముసఁ దమతమ పనులనెరవేర్తురు.

గొప్ప వ్యవహారముల నడుపుటకు నాధారములు రెండు. మూలధనము, బుద్ధిబలము. ఈకాలమున బీదలుసైతము కుశలతయు, యోగ్యతయుఁగలవారు గానున్న మూలధనము సేకరించుట దుర్ఘటముగాదు. ఎట్లన, అనేకులు గలసి తమకుఁ గలిగినది కొంచెమో యధికమో వేసికొనిన "ఓల్డ్ హేమ్" అను నింగ్లాండులోని యొకానొక పట్టణమువందలి శిల్పుల మాడ్కి తామే ఘనమైన శాలలఁ బ్రతిష్ఠింపఁజాలుదురు. బ్యాంకీలు, నిధులు మొదలగు ధనాగారములలో నెంతో రొక్కము వ్యర్థముగాఁబడి కుళ్లుచున్నదిగాన తగిన వ్యావహారికులు వచ్చిరేని నయమైనవడ్డితో ఋణమిచ్చుటకు నెందఱో కాచుకొని యున్నారు. మఱియు, తాను బీదవాఁడుగావున తనకెవ్వరు నప్పునియ్యరనుశంక గొనినది సహజమేకాని, యనేకులు బీదలైన కర్మకరులు సంఘములుగానేర్పడి సమూహముగ నేమెల్లరము నుత్తరవాదులము, అని నమ్మికఁజెప్పి యర్థించిన నట్టిసంఘములకు మితవృద్ధిఁగోరి ధనము నొసంగ నెవరునూ వెనుకదీయరు. ఇండియాదేశములో, కో ఆపరేటివ్

క్రెడిట్ సంఘములు (అనఁగా బరస్పర ముత్తరవాదులుగా నుండవలయు ననే నియమముతో ననేకులు గలసి ఋణప్రసాధనమునకై యేర్పఱచిన సంఘములు), సంఖ్యలో నానాఁటికిం బెఱుఁగుచున్నవి. కారణమేమి? కలసి యర్థించిరేని మోసమునకు నవకాశము తక్కువ, దివాలెత్తుదురను భయము తక్కువ, కావున వడ్డి తక్కువ. ఇచ్చుసొమ్ము ఎక్కువ. కావున నన్యోన్యతమై సమాజములుగ నేర్పడిన బీదలు నయితము కావలసినంత మూలధనము లేవఁగలరు. విశ్వాసము, విమర్శ, ఉత్సాహము మొదలైన యుత్తమ వ్యవహార సంప్రదాయము లఖండముగనుండు ఇంగ్లాండు మొదలగు పశ్చిమదేశములలో మూలధనమునకు పంటకు క్షామము లేదు. మఱియెన్నఁడును రాదు. మూలధనము గడించుట దుస్తరముగాదు. కావున శ్రమకరులకుండు ముఖ్యమైన లోపము పరిపణమున్నట తప్పు. మఱివారిని దలయెత్తనీయక హీనస్థితిలో నుంచునట్టి ప్రమాదమెయ్యదియనఁ, జ్ఞానశూన్యత. ఇప్పటికాలములో వ్యవహారములు విస్తారము నొందినంగాని సమగ్రఫలంబులుగావు. విస్తార వ్యవహారసంఘటనకు తత్సంబంధములైన యన్నివిషయములయొక్కయు యంత్రములయొక్కయు నుదంతముల నెఱింగి యాలోచనతో వర్తించుట యావశ్యకము. ఇది పర్యవేక్షులకే కాని కూలివారలకుం జెల్లదు. శిల్పులెన్నియో విధంబుల వారి

తేలిన వారైనను విద్యావధానంబులఁ బరిశ్రమ లేని వారగుటఁ జేసి వలసినంత ధీశక్తిఁబడయుట వారికి సులభంబు గాదు.

అయినను నీకాలమునఁ బశ్చిమ రాజ్యములలోని జను లెల్లరు చదువను వ్రాయను నేర్చినవారగుటచేతను, పుంఖాను పుంఖములుగ వార్తాపత్రికలుండుట చేతను ఈ కొఱంతయుఁ గొంతకుఁగొంత వారింపఁబడుచున్నది.

పరస్పర సముదాయముల చరిత్రము

ఈ క్రిందఁ బేర్కొనఁబడిన దేశముల యందలి ముఖ్యాంశములు మాత్రము కొన్నింటి నిటఁ బొందు పఱచుచున్నామని తెలియునది.

(౧) ఇంగ్లాండులో :—

ఈ సముదాయములు రెండు జాతులు. వినియోజకములు, ఉత్పాదకములు. అనఁగా వినియోగము, ఉత్పత్తి వీనిని సరసముగ నడిపించుటకై వినియోజకులు, ఉత్పాదకులును గలసి కట్టిన పరస్పర సహాయ సంఘములనుట.

వినియోజకాన్యోన్య సంఘములు

నిర్మాణోద్దేశము:- భోజ్యములు, పానీయములు మొదలగు వస్తువులను జిల్లరగాఁగొనిన వెలయెక్కువ యియ్య వలసి వచ్చుననుట స్పష్టము. వానిని మొత్తపు వెలకుఁ గొన్న నచ్చివచ్చును. మొత్తపుఖరీదులకుఁ గొనవలయునన్నఁ గొను

మొత్తము గంభీరముగ నుండవలయు. ఒక్క పలము చక్కెరను మొత్తపు వెలకు షావుకారువాఁడు నమ్మఁడు. ఒక్క మణుఁగుఁ గొంటేని వర్తకులు ధరలందగ్గించి యిత్తురు.

చూడుఁడు! అట్లగుటం జేసి కూలివారు మొదలగు బీదలు మొత్తపు ధరలకు గొప్ప మొత్తములఁ గొనవలయునన్న నుపాయమెట్లు? వారు సంఘముగాఁ జేరి కొనుటయే. అట్లుకొని వస్తువుల విభాగించుకొని లేని వ్యయము మిగిల్చిన వారగుదురు. ఇదియే వినియోగిక సమాజముయొక్క ముఖ్య ఫలమును దాత్పర్యమును.

1844-వ సంవత్సరమున 'రాక్‌డేల్' అను పట్టణములో 28 మంది శిల్పులు కూటముగ నేర్పడి భోజ్యముల మొత్తముగఁ గొని యంగడి వెలలకే తమలోఁ దమకు నయ్యవి విలిచి, సెలవులుపోఁగా మిగిలిన లాభమును అప్పుడప్పుడు పంచుకొన నారంభించిరి. వీరిచర్య యీసంఘములసిద్ధికి బీజము వంటి దనుటలో నతిశయోక్తి యేమాత్రమును లేదు. మహానదుల జన్మస్థానములు అల్ప ప్రవాహములుగ నుండురీతిని పరస్పరసహాయ పద్ధతియు నీచిన్ని యుద్యమమున నుద్భవించినదాయె! మార్గ దర్శకులైన యీ సమాజములవారు లాభములో నొక పాలు దుకాణములోని సేవకులకును మఱియొకపాలు తమ వారికిఁ జదువు సాములు చక్కఁగా నేర్పుటకునై యెత్తిపెట్టి

మిగిలిన భాగము మాత్రము తాము స్వీకరించునట్లు సహాయము బొనర్చి యన్యోన్యతను నిలిపిరి.

తదనంతర మిట్టి సమాజము లనేకములు నెలువడినవి. గాని, స్వలాభాపేక్షచే సాంఘికులు కొన్ని యెడల శ్రమకరులకు భాగము లేర్పఱుపక యావత్తును తామే సంగ్రహింపం దొడంగిరి. ఇవి సామాన్యములైన భాగస్థులు కలసి చేయు వ్యాపారముల వంటివి. సామాజకులు భాగస్థులవంటి వారు. వచ్చిన లాభముఁదామే స్వీకరింతురు. సామాజకులే వాడుకకాండ్రుకదా యని యందురేమో? అయిన నేమి? కంపెనీలలో భాగస్థులు వస్తువులుగొన్న వద్దను వారుగలరా? అట్లగుటంజేసి యిది నిజమైన తారతమ్యము గాదు.

పరస్పర సమాజములలో మొత్తపు లాభమును సామాజకులకుఁ బంచి యిచ్చుటయేగాక ప్రతి సామాజకుఁడును తమ యంగడిలోఁ గొను సరకుల వెలల పరిమాణమును ననుసరించి వానికి తఱుగుడు నిత్తురు. అనఁగా 100 రూపాయల వస్తువులు గొన్నవారికి 10 రూపాయలు, ఇట్లు నియమముల ననుసరించి త్రోవుడుచేయుట. ఇట్టి సహాయములచే సామాజకులు తమయొద్దనే తీయునట్లుచేయఁ జూచుటయుంగలదు. ఈ త్రోవుడు తమ సమాజమునకుంజేరని వాడుకకాండ్రకియ్యరు.

ఈ యంగళ్ళకే యింగ్లీషులో "కో ఆపరేటివ్ స్టోర్స్" అని పేరు. ఇవి విక్రయశాలలుగాన—అనఁగా వస్తువులను

వాడుక కాంట్రకుఁ బంచియిచ్చునవి యనుట—వీనిని స్థాపించు సమాజములకు విభజన సమాజములనియుం బేరుగలదు. ఈ శాలలవలన కర్మకరులకుఁ గలుగు ఫలములు:—

(౧) కూడబెట్టిన ధనమును వడ్డీ వచ్చునట్లు నిక్షేపించుట కివి యనుకూలములు.

(౨) వస్తువులఁగొనుట మొదలైన విధముల వచ్చు లాభము చిల్లరచిల్లరగా వచ్చిన నప్పుడప్పుడే సెలవై పోవును. అట్లుగాక సాంవత్సరమున కొకటి రెండు తడవలుగ మొత్తముగాఁ జేరిక నందిన నీ లాభమును వ్యర్థముగాఁజేయక లాభకరములైన యుద్యమములలో మూలధనముగఁ బ్రయోగింతురు.

ఈ రెండు గుణమ్ములుండిన మాత్రముననే వీని నన్యోన్య సమాజములని చెప్ప శక్యముగాదు. పరస్పరత నిక్కంబగుటకు నాధారములు రెండు. సేవకులకు లాభములో పాలిచ్చుట, లేక భాగస్థులు గాకున్నను యజమాన మండలిలోఁ జేర్చుకొనుటయును, వాడుక కాంట్రకు అనఁగా వినియోగకులకుఁ దాము గొను వస్తువులయొక్క ధరల పరిమాణముంబట్టి తటుగుడు మొదలగు విధముల లాభమునఁ గూర్చుటయును. ఈ లక్షణములు లేకున్న శ్రమకరులకు బీదలకు సంత యుపకారముం జేయునవి యయ్యును అవి నిజమైన యన్యోన్యతా వర్గములు గావు. కూటి క్షత్రియములు. సామాన్యములైన కంపెనీల వం

టివి. అనఁగా ధన సంపాదనముం దప్ప నింకేయర్థమును సాటిఁ పనివి.

విక్రయములకై స్థాపింపఁబడిన వినియోజక (లేక విభజన) పరస్పర సమూహములుగాక ఉత్పత్తి—అనఁగా వస్తురచనాదికళ—నెఱవేర్చుటకై యాక్రమము నవలంబించిన యుత్పాదక పరస్పర సమాజములుం గలవు. ఇవి విక్రయశాలలట్లు ఘనతరములుగావని యీ సంఘముల గుణదోషములఁ జర్చించు నవసరంబున సూచించితిమి. ఇందులకు చరిత్రాంశములును సాక్ష్యము నిచ్చుచున్నవి. ఎట్లన:—

ఇంగ్లాండులో 1890 సంవత్సరాంతముననున్న పరస్పర వర్గముల వివరము:—

| | సంఖ్య | సామాజకులసంఖ్య | మూలధనము (సవరనులు) |
|---|---|---|---|
| విభజనసమాజములు | 1418 | 10,26,912 | 10,607,482 |
| ఉత్పాదక సమాజములు | 119 | 27,214 | 597,988 |
| ఇతరములు | 16 | 62,929 | 10,56,587 |

వీనియొక్క వృద్ధివేగముం దెలుపు సంఖ్యములు:—

| సంవ॥ | సమాజముల సంఖ్య | సామాజికులసంఖ్య | మూలార్థము (సవరనులు) |
|---|---|---|---|
| 1866 | 915 | 174,993 | 1,046,810 |
| 1876 | 1165 | 507,857 | 5,804,019 |
| 1886 | 1296 | 885,200 | 9,297,506 |
| 1890 | 1554 | 1,117,085 | 12,281,952 |

పనివాండ్రచే నిండిన యీ సమాజములు మిక్కిలి తక్కువవడ్డికి 2,800,000 నవరసులను బ్యాంకీలు మొదలగు ఋణదాయి వర్గములనుండి వ్యాపారార్థ మప్పుఁబడసినవి. ఇది చూడఁగా నికముందు మూలధనము గలవారు కూలికి శ్రమకరులను నియమించుకొనుటపోయి శ్రమకరులు వడ్డీయనుకూలి నిచ్చి మూలార్థములఁగొని ప్రభువుల పదవిం జెందుదురేమో యనిఁతోఁచెడిని!

ఉత్పాదక పరస్పరవర్గములు బీకువడియున్నవనుట స్పష్టము. దీనికి హేతువులెయ్యవి? అరయుదము.

సేవకులును లాభములోఁ బాలుగొనియుండుట యీ పద్ధతియొక్క యాధారలక్షణములలో నొకటిగదా! ఈలక్షణమింకను ముకుళితస్థితిలో నున్నదిగాని వికాసమునకు రామింజూచి చింతనీయము. 1889-వ సంవత్సరమున జరుపఁబడిన యీ సమాజములవారి సాంవత్సరిక సభలో నుత్పాదకసంఘములు స్పష్టిఁ గాదమికిఁగారణము లీక్రిందివని వారేర్పఱిచికొనిరి. అవియెవ్వియన:—

(౧) ఈసమాజములు చాల చిన్నవి. విస్తారవ్యాపారము వహింపఁజాలినవి కావు.

(౨) మఱియుండొంటితో నివియు మిక్కిలి స్పర్థించుచున్నవి. బయటికళాశాలలవలని స్థైరము ప్రాణకంటకముంగనుండఁగా నిక్కఁ దమలోఁజాలు మత్సరముం జెందినగతియెట్లుకే

(3) వీనికెల్లను సంధిగల్పించి స్నేహభావమున వర్తించున ట్లుచేయఁ గొందఱు ప్రయత్నించిరి గాని వారితలంపు కొనసాగలేదు. నిజమైన పరస్పరత యెంతో గొప్పగుణము. మాటలలో దాని వర్ణించువారు పెక్కురున్నారుగాని చేసి చూపువారి సంఖ్య యత్యల్పము.

ఇతరకారణములు మున్నే చర్చింపఁబడినవి. ఈయుత్పాదక సమాజములలో నిప్పటికిని జయప్రదములైనవి యెవ్వి యన :—

(౧) లెస్టరు పట్టణములోని బూట్సు ఫ్యాక్టొరీ.

(౨) గోధుమలను బిండిఁజేయు ఫ్యాక్టొరీలు 6. ఇవి యన్నిఁటికన్న బాగుగా నడుపఁబడుచున్నవి.

కోఆపరేటివ్ వ్యవసాయము ఇంగ్లాండులో నింకను ప్రబలమునకు రాలేదు. కాని యైరోపాలోని యొకటి రెండు దేశములలో మంచివృద్ధికి వచ్చియున్నది.

'ఓల్డ్ హేమ్' అను పట్టణములోని వస్త్రరచనాశాలలనేకములు శ్రమకరుల యధీనములై యున్నవి. అయిననొక్కటి వ్శాలలలోఁ దమకు భాగములున్నప్పు యందుఁ దాముఁపని చేయక తదితరశాలలలోఁ గూలికి నిలుతురు. కొత్తము మీఁద నివి సంభూయ సముత్థానములకుం (జాయింట్ స్టాక్ కంపెనీలకుం) జేరినవికాని పరస్పరతా పద్ధతిం బ్రాల్చినవికావు.

## ఇంగ్లాండుగాక తక్కిన పశ్చిమ దేశములలోని కోఆపరేటివ్ సంఘముల చరిత్రములు

ఇవి రెండు విషయములలో, నింగ్లాండున్న మీఱియున్నవి. వేనియం దన (౧) వ్యవసాయమున (౨) ఋణసాహాయ్యార్థమైన నిధి జాలమున.

వ్యవసాయము:—కాఁపువారు ఇతరేతర సహాయార్థము సంఘములుగఁ జేర్పడి కర్షణ యంత్రములు మొదలైన వానింగొని వంతుప్రకారము వానిని వాడుకొనుట, ఎరువు మొదలగు సామగ్రులను మొత్తముగాఁ గొని పంచికొనుట, ధాన్యమును ప్రోగుసేసి యందఱును గలసి యేకవాక్యముగ వర్తకులతోఁ బేరమాడుట, ఇత్యాది క్రియలచేఁ దమ దారిద్ర్యము నివారించెదరు. మఱియు సంఘముగ నప్పుగొనిన తక్కువవడ్డికి లభించుఁగాన సర్వవిధముల వ్యయము తగ్గునట్లును, ధాన్యము, వెన్న, జున్ను, వీనివెల హెచ్చునట్లును జేసి మునుపటివలెఁ గష్టనష్టములకుం బాత్రులుగాక యిప్పుడిప్పుడు ధనము మిగిల్చి కూడబెట్టువారును అగుచుండుటఁజూడ నిట్టి వర్తనముల హిందూదేశీయు లభ్యసింపఁ గలిగిరేని మనవారును ఇంచుమించుగా పచ్చగానుండక మానరనుట విశదము. డెన్మార్కు దేశములో వెన్నఁదీయు శాల లఖండములుగ నున్నందున నద్దాని ఎగుమతి యేఁటేఁటకు నెక్కువయగుచున్నది.

కో ఆపరేటివ్ బ్యాంకీలు కృషీవల సంఘములకున్నం, తయుం దోడై సాహుకారుల చేతులలోఁజిక్కి కోపువారు నలఁగకుండునట్లు లుద్ధరించుచున్నవి. తన నాణెముఁబట్టియే యప్పుఁదీయవలయునన్న నెక్కువ వడ్డికి సమ్మతించినంగాని కాదు. సంఘము త్తరవాదిగానున్న తక్కువ వడ్డీకి నెనరైన నిత్తురు. కావున బలహీనులును పొత్తుచేత ధనాఢ్యులవలె సత్తువగలవారగుట సర్వజన వేద్యముగాని, యట్టి పొత్తునుగలిగి కలసిమెలసి యుండు గుణమ్ము లింకను ననుభవమునకు బాగుగవచ్చినట్లు గానము. ఇతర దేశములలోనికన్న హిందూదేశమున సులభ ఋణము ప్రధానము. కారణమేమనియందురేమో వినుండు! వాన లప్పుడప్పుడు రాకపోవుటచేత కిస్తీ చెల్లించుటకును, పండుగలు, వివాహములు, చావులు పుట్టుకలు, ఇత్యాది సంస్కారములు వలదన్నను దమంత వచ్చి పడుటచేత బలాత్కార దానధర్మోత్సవాదిక్రియలకు నరణముం బెట్టుటకును ద్రవ్య మమేయముగఁ గావలసి యుండుటయే కాక, యా సమయమున కే తప్పక లభించినంగాని మానహాని సిద్ధము. కావున కాఁపులు తరుణము వేఁచి నిలిచినిదానముగ బేరమాడలేరు. వృద్ధ్యాజీవులైన సాహుకార్లు ఇదే మనకు సమయమని 100-కి నెలకు రెండు మూఁడుగ వడ్డి విధించి, నేలల కుదువ వ్రాసికొని రైతుల నెల్ల విధములఁ గొల్లఁగొట్టి, పాప పరిహారార్థము గుళ్లు గట్టించి ధర్మాత్ములని ప్రసిద్ధి వడయుట మనకందఱకును తెలిసిన సంగతియకదా!

స్వాతుం జూచి దేవస్థానములఁ గట్టించుట భక్తిచేతఁగాదు, మఱి కృతజ్ఞతనైన నెట్లనిన. దేవతలకుఁ దృప్తిచేయుటకై కాదె కాఁపువారు సంస్కారముల నిర్వర్తింపం బూని తమకు వికారముం దెచ్చికొనుటయు, సాహుకార్లకు సర్వస్వము ధారవోయుటయు? కావున దేవతలు అన్యాయవృద్ధికి స్థానములును, రైతులకు అష్ట దిగ్బంధనములునై, యుండుటచేత ఋణజీవులకు పరమాశ్రయులు, నిత్యసేవ్యులు. పరలోకమున మోక్షమిత్తురో యియ్యరో కాని, సాహుకార్లు ఇహలోక మోక్షమునకు వారు కల్ప వృక్షములు. ఈ వృక్షముల నెండఁబెట్టినంగాని కాఁపువారికి సుఖజీవన మసంభవము. ఈ విషయము వినిమయకాండ సంబంధి గావున నింతటితో నిప్పటికి వదలవలయు.

మన దేశములో కోఆపరేటివ్ ఋణసంఘములు ప్రకృతము బహుళత్వరితగతి వ్యాపించుచున్నవి. వీనింగూర్చిన వివరములిఁక ముందుఁ దెలుపఁబడును.

కోఆపరేటివ్ వ్యవసాయము మొదలైన యుత్పత్తి కార్యములు నిర్విఘ్నములుగ నెరవేఱవలయునన్న కోఆపరేటివ్ విక్రయశాలలతో సంధగలిగియుంట మంచిది. అట్లయిన సరకు లమ్ముడువోవు మార్గము సిద్ధము. ఇంగ్లాండులో పరస్పర వర్గములచేఁ బాలితములైన భూముల విస్తీర్ణత సుమారు 2000 ఎకరములు. ఇవి ధాన్యములు, పండ్లు,పశు సంతానములు, వెన్న, పాలు, జున్ను ఇత్యాదివస్తువుల ప్రాప్తికి నాధారములు. మఱి

యు నీవర్గములు విభజన వర్గములతో సాంగత్యముగలిగియుం డుటంబట్టి యీ పదార్థములు విక్రయ శాలలు వారిద్వారా యీ సంఘములకుం జేరిన శ్రమకరులు మొదలగు వారలకు ననాయాసముగ నమ్ముడుపోవును. విభజన వర్గములవారే తమకు సరకు లక్కఱలేక లభించుచుండవలయునను కోరికచే భూములంగొని పంటంబెట్టుటయు, వస్తురచనకై ఫ్యాక్టొరీల స్థాపించుటయుం గలదు. ఇందుచే వ్యక్తమగు నీతి యేదన, సజాతీయములైన వినిమయ శాలలతోంగలిసి యుండినంగాని పరస్పరతా పద్ధతిమై ప్రారంభింపంబడిన యుత్పత్తికార్యము కొంతవఱకుజయ శీలమైనను తప్పక నిండు జయమొందునను నిశ్చయము లేనిదగును. నిర్వికల్ప సిద్ధికి కోఆపరేటివ్ అంగళ్ళతోడి సంయోగము ప్రధానము.

### కోఆపరేటివ్ ఉత్పత్తిశాలలు
### (ఇంగ్లాండులోనివి)

ఇంగ్లాండులో వస్తువుల రచించుకార్యమునం బ్రవేశించియుండు పరస్పర సంఘముల సంఖ్య సుమారు 120. ఇందు సేవకులకు లాభముననుకార్యవిచారణముననువంతు నొసంగి పరిపూర్ణ పరస్పరతగలయవి సుమారు 75 మాత్రము. తక్కినయవి లాభమును భాగస్థులకును వాడుకకాండ్రకును బంచిచ్చి, సేవకులకు కూలితప్ప మఱేమియు నీయని యపక్వ పద్ధతి నవలంబించిన వ్యావహారిక సమాజములు. ఈ సమా

జనులు చేరిన వారిలో ముక్కాలు మువ్వీసముమంది శ్రమకరు లయ్యును వారును దమ సేవకులం దక్కువగాంజూచుచు, తాము తమ యజమానులనుండి పడయంగోరిన హక్కులను దమకు నధీనులైనవారికి నియ్యక యుండుటంజూడంగా, మనుష్యుల కొక్క సహజశాఠిస్స్యము గోచరింపక పోదు. అయిననొక్కటి. ఇప్పుడు పదిపండ్రెండేండులుగా స్థాపనకువచ్చు సమాజములలో కూలివారికిని లాభ భాగాదులేర్పడి యుండుటవలన భావిని పరస్పరత సర్వవ్యాపినియై యుండునేమోయను కుతూహలము గలిగెడును సమగ్రమైన యన్యోన్యతం బూనిన సంఘముల లోని శ్రమకరుల సంఖ్య ప్రకృతము సుమారు 6000. ఈ సంఘములవలని మేలులలో ముఖ్యము లెయ్యవియన :—
(౧) శ్రమకరుల యభివృద్ధి. (౨) కర్తలకును గర్మకరులకును గలహములు లేకపోవుట. (3) శ్రమకరులకు విద్యజెప్పించుట, పింఛను లిచ్చుట మొదలైన యుదారక్రియలకునై ద్రవ్యసంచయముల ప్రోగుచేసి వినియోగించుట, ఇత్యాదులు.

కో ఆపరేషను వలన జనసంఘములకుంగల్గు శ్రేయస్సులు

1899-వ సంవత్సరములో నింగ్లాండులోని కో ఆపరేటివ్ సంఘములచే విక్రయవిషయముగాం జేయంబడిన [illegible] సుమారు 24,000 నవరసులు. అనంగా 3,60,000 [illegible] నసుట! పాఠశాలల స్థాపించుట, పండితులచే ప్రసంగములు [illegible]యించుట, పుస్తకభాండాగారములం బ్రతిష్ఠించుట ఇత్యాది

సాధనములచే జనసామాన్యముయొక్క హృదయమునకు నుల్లాసము నుత్సాహముం దెత్తురు. మఱియు బుద్ధికౌశలత గలవారయ్యు దారిద్ర్యమువలన ఆక్స్ఫర్డ్, కేంబ్రిడ్జి విశ్వవిద్యాశాలలలోఁ జదువనేరని బాలురకు సహాయముగా సంవత్సరమునకు రు. 3000 ఆదాయముగల విద్యార్థివేతనకోశముల కొంటిని స్థాపించియున్నారు. తమవారప్పుడప్పుడు వేడుకగా ప్రొద్దుపుచ్చుటకై వినోదసభలఁ జేయించెదరు. వీనివలన దేశములోని జనులలో పరస్పరగౌరవము మైత్రియు వృద్ధియగుచున్నవి. అపరిపూర్ణములైన వర్గములు, ఇంచుమించు సామాన్యసంఘములవలె నున్నవి యంటిమిగాదె? ఇవియుఁ గొన్ని విధములంజూచిన నట్టికంపెనీలకన్న నెంతోమేలైనవి. ఎట్లనిన:—(౧) కంపెనీలలో భాగముల ననుసరించి యధికారముండెడిని. అందఱుఁగలసి యాలోచనకుఁ గూర్చున్నపుడు ఒక్క భాగముగల వాఁడీయఁగల సమ్మతియొక్కటియే. పది భాగములు గలవానియవి పది. అసమగ్రపరస్పర వర్గములోనైతము భాగస్థులందఱు సములు. 10 రూపాయలు మూలధనము వేసినవాని కెంత సొంతమున్నదో యంతేగాని 100 రూపాయల యాసామికి నంతకన్న నెక్కువసొంతముండదు. (౨) కంపెనీలలో మూలధనముయొక్క - అనఁగా భాగములయొక్క పరిమాణము నియతమై యుండును. లక్షరూపాయల మూలధనముగల కంపెనీ యిది యని సర్కారులో రిజిస్టరయ్యెనేని

వాడుకకాండ్రకు వారుగొను సరకులకొలంది తొలుత లాభములో నొకవంతు పంచియిచ్చి, మిగిలినదానిని మాత్రము మూలధనమునకుఁ జెందునంశమని నివేదింతురు. వాడుకకాండ్రకు లాభములఁ జేర్చు విధములు రెండు. (౧) తఱుగుడు నిచ్చుట. (౨) ఇంకను ముఖ్యమైనరీతి యేదనఁగా 100 రూపాయల సరకులఁ గొన్నవారికి నిమాత్రమని సంవత్సరాంతమున నిచ్చుట. అనఁగా బ్రతివాఁడును గొను సరకుమూల్యము లెక్కవెట్టి తదనుక్రమముగ లాభభాగముల విధించుట. వినియోగము ననుసరించి సరకులఁ గొందురు. ఎక్కువలాభము గ్రహింపఁగోరి వినియోగకార్యమును-అనఁగా తినుట, కట్టుట యిత్యాదుల-నే లోభియు నెక్కువ సేయఁడు. మొత్తముమీఁద పుంజీదార్లకు నీ వర్గములో ప్రధానత్వము మిక్కిలి తక్కువ.

అక్కడక్కడ వెదఁజల్లినట్లుండు నీసంఘములు, కలయికఁ గలిగియున్నంగాని తమకు బ్రదుకు బలము కష్టములని యొండొంటితో సంధిసలిపి, దేశీయమైన యొక్కటే మహాసంఘముగా నేర్పడునట్లున్నవి. ప్రతిసమాజములవారును, ఏఁటేఁట జఱుగు దేశీయ పరస్పరవర్గ మహాసభకు బ్రతినిధులను బంపుదురు. ఈ మహాసభలో నన్యోన్యతా విషయమైన యఖిల విషయములును చర్చింపఁబడుటయే కాక అన్యోన్య సంఘముల వారిచేఁ బరిశీలితములైన నూతన సంగతులును అఖిలవేద్యములుగఁ జేయఁబడును. ఇవియన్నియు నేకకుటుంబమునకుఁ

జేరినవ్యానివలె నుండవలయుననుట వారిముఖ్యోద్యమము. కా వున నుత్పత్తిమొదలు సర్వార్థిక క్రియాసమర్థములన్నియు నెం దొరులకు భాగాళమూగఁ దెలిసి యవిభక్తముగ నుంచికొం దురు. ఉత్పత్తిశాలలు విక్రయశాలలును పొత్తుగలిగి యుండు చోట్ల వానికి వచ్చులాభము, అట్టిపొత్తు లేక స్పర్ధమైఁబని చేసినవానికి రాదుగాన, నానంఘములకుం జేరిన యుత్పాదకుల కును వర్తకులకును గాఢమైన కూటమి పట్టువడియున్నది. మఱియు నిత్యంత విస్తారవ్యాపారోపేతములైన వినిమయ శాలలు, సరకులఖండితములుగఁ దమకు దక్కుటకై వ్యవ సాయము, వస్తురచన, ఇత్యాద్యుత్పత్తి ప్రయత్నములఁ దామే ప్రారంభించుటయుం జూచి యున్నారము. సహావర్గము లతో నంధనలదని ప్రత్యేకముగ నిలిచిన సంఘము లనేకములు లీడువడినయవి. దీనింబట్టి చూడఁగాఁ బరస్పరతాధర్మమున వర్గ సంయోగమును ధర్మము లీనమైయున్నదని తోఁపకపోవునా? అట్లగుటచే దేశములు, మైత్రితోఁ జేయఁబడు వ్యాపారముసఁ కారణమైనంగాని యన్యోన్యతాపద్ధతి సంపూర్ణత వహింపదు. కావుననే ఇదా సంఘ సంస్కారములుగోరు మహాత్ములు, ఈపద్ధతియే సర్వదోషపరిహారిణి యనియు సర్వసుఖప్రదా యిని యనియు ఘోషించుచుండుట. ఇంక నీయార్థిక పద్ధతి యందును దీనియందులలె నైకములకొర్చి పరోపకారబుద్ధితోఁ బాటుపడువారు, అంత తఱుచుగ లేరు. అనేకుల కిదియే యొక

మతము! యావజ్జీవము దీనిని వ్యాప్తికిఁ దెచ్చుటకొఱకుఁగడపి యదియే మహానందమని యుండువారి సంఖ్య యత్యల్పము!

స్పర్ధను నిరోధింపఁ జూచుట యన నేమి?

ఒక విధమునఁ జూడఁబోయిన స్పర్ధను నిగ్రహించుట యప్రకృతమైన యత్నము. ఎట్లన. స్పర్ధను నిగ్రహించుటకు నా స్పర్ధతో స్పర్ధించుట యావశ్యకముగదా? అట్లగుట స్పర్ధ యే రీతిని నిర్మూలమగును? “స్పర్ధ నిత్యము. సర్వ వికారముల నంతర్యామియైన తత్త్వము” అనుటయు సత్యము.

చూడుడు! ట్రస్టు లనఁబడు మహాసంధులు స్పర్ధకు నాటంకము లంటిమి. అనఁగాఁ దమ్ము నిరాకరించి ప్రవర్తిల్లఁ జూచు వైరుల స్పర్ధకు ననుట గూఢము. తమచేతనే ప్రయోగింపఁ బడు స్పర్ధకు తాము అడ్డుగొబ్బులు కామి తెల్లంబు. ఈ ట్రస్టులకన్న నెక్కువ మాత్సర్యముతోఁబని సేయు వ్యవహారములున్నె? మఱియు హిందూదేశములోన నస్పర్ధ తంత్రములు వాలాయముగ నాచారములో నున్నవంటిమి. ఇవి మాత్రము స్పర్ధించుట లేదా? తత్పూర్వపు స్థితుల నంత నొందించనిది వీని కిట్టి ప్రాశస్త్యము వచ్చియుండదు. మఱి యీ కాలమున వీనిపై వైరమెత్తి వచ్చు నవనాగరక ప్రచారముల నిరాకరించి యెదిరించినిలువనిది వానికి నింకను ఉనికి యుండదు. ఇంతే కాదు. ప్రాచీనాచార పద్ధతుల నంగీకరించు వారి యందును వానియందుఁ ద్రికరణ శుద్ధిగ నమ్మువారికి గౌరవము నాయు

కత్వము సేకూర్పఁబడవేని యాయాచారములకు భంగము తప్పదు. అట్లగుట సంఘమున రాజమాన్యపదవి నందుటకై స్పర్ధ యున్నదనియు, నందు భక్తిశ్రీలందే జయము కలుగు ననియు, సేర్పడితిమి. నిర్మాత్సర్యులమను మన వారును మెత్తని పులులు. అను సర్గించిన నాశీర్వాదము, లేనిచో బహిష్కారము, ఇత్యాది యుపాయములు లేనివారుగారు.

కావున స్పర్ధ మొదలంట నశించునని యాశించుట యుక్తముగాదు. ప్రాణులు పోయినగాని యది మనల వదలదు. ఏలన, అయ్యది యార్థిక తంత్రములలో నొక్కటిగాదు, మఱి సర్వ తంత్రములయందును జీవరూపమై యిమిడియుండు మహాశక్తి.

ఏ యార్థికస్థితియందుఁగాని మూఁడు విధములైన స్పర్ధలు శాశ్వతములు

(౧) తనకుం బూర్వమైన స్థితిని స్థానభ్రష్టముం జేయుట.

(౨) తన్ను నాక్రమింపఁజూచు ఇతరస్థితుల నిరోధింపఁ జూచుట.

(3) తనకుంజేరిన పాత్రములలోఁ దనభావమునకు నెంతయు నరిపోయిన వారిని తదితరులకన్న నెక్కువ ఫలముల ప్రసాదించి యుద్ధరించుట.

మన శరీరమునందును నీ వీరోద్యోగములు విరామము లేక జఱుగుచున్నవి. ఎట్లందురో? కలరా, మహామారి, చలి

జ్వరము. వీనిని కలిగించు పురుగులు మనదేహములోఁ జొరఁ బడ వేచియున్నవి. వానికిఁ జోటియ్యక దేహశక్తి యడ్డపడు డును. అనఁగా సాధ్యమైనంత దనుక. మఱి జ్వరము వచ్చెఁబో, దానిని రూపుమాప సహజముగ శరీరముద్యోగించును. " ఇంకను అమితభోజనము, అమితనిద్ర, ఇత్యాది నిజస్వభావవిరుద్ధ క్రియలకు నేయంగములైనఁబూనిన వానికి మాంద్యము, నొప్పి, వాపు మొదలగు శిక్షల విధించును.

స్పర్థ ప్రాణులకు సహజము. ఈ స్థూలప్రపంచము యొక్క ప్రధానగుణంబులలో నొకటి.

కావున స్పర్థను నిరోధించు పద్ధతులనఁగా, నిప్పుడు దాఁ దాఁపు నూఱేండ్లుగాఁ బశ్చిమ సీమలలో వ్యాపించిన స్పర్థను అనుట గాని, సర్వవిధములైన స్పర్థలను అనుట కాదు. అన్యోన్యపద్ధతులం గూర్చి యోచింపుఁడు. ఇవి ప్రాచుర్యమునకు రావలయునన్న తదితర పద్ధతులఁ బడఁగొట్టవలయు. మఱియు నీ యన్యోన్యతా భావముగల వారికివి మేలుచేసినను తక్కిన వారిని చేరనియ్యక తఱుముఁజూచును. కాఁబట్టి పరమశాంతి నీనుగులకుఁగాని ప్రాణులకుఁ బట్టువడుట యస్వాభావికము. అంత చల్లఁదనము రావలయునన్న నూపిరి పోవలసినదే.

మాత్సర్యము నిరోధించుట యనఁగా 'నొక విధమైన మాత్సర్యమును నింకొక విధమైన 'మాత్సర్యము నవలంబిం

చుటవేళ ననియర్థము. అట్లయిన నన్యోన్యతాది పద్ధతులు విడ
ళింపఁజూచు నిప్పటి స్పర్ధయొక్క లక్షణములెవ్వి యనిన:—

(౧) ప్రతివాఁడును దనలాభము మాత్రమాశించి యిత
రులెల్లరులతోను వైరంబుదాల్చి యుపక్రమించుట.

(౨) ప్రతివ్యవహార చక్రములోను నుండు శాలలన్ని
యు 'నే ముందు నే ముంద'ని ద్వేషబుద్ధి నొండొంటిఁ గడవఁ
బూని, యప్పుడప్పుడన్నియుఁ బల్లములోఁ బడుట.

అన్యోన్యతాపద్ధతియొక్క ముఖ్యగుణంబులన్ననో

(౧) ధనలాభ మాత్రమాశింపఁగూడదనుట. ధనమున
కంటె క్షేమము మేలు.

(౨) వ్యవహారాదుల సంఘక్షేమపరమైన దృష్టితో
నడప వలయుననుట.

(౩) చిల్లర స్పర్ధలు తగవు. గొప్పగొప్ప కూటములు
గా నేర్పడుట యుక్తము.

కాఁబట్టి యార్థిక రంగమున నీ రెండువిధములైన స్పర్ధ
లు ప్రతిఘటించి యున్నవి. ఇఁక ట్రస్టులును నీ రెండింటిని
మింగి యింకొక విధమైన శక్తిచే (అనఁగా విశ్వరూపముఁ
దాల్చి యందఱిని భయకంపితులం జేసి) నేక చక్రముగ వ్యా
పారప్రపంచము పాలింపఁ బ్రయత్నించెను. శిల్పులు నూర
పెండునట్లు కానము. ధనవంతులైన కర్మకర సంఘముల సంఘ

టించి యజమానుల నోడించి తామే యవక్రముగ నన్నింటిని తల్లక్రిందుగఁ జేయుదమని వారును ఉన్నారు. కావున స్పర్ధలు నిరోధింపఁ బడుచున్నవని సామాన్యముగ నందఱు పలుకుదు. నట్లు పలుకుట కన్నను, వివిధ స్పర్ధలొండొంటిం దాకి పెనంగుచున్నవనుట యింకను నొప్పు.

అర్థశాస్త్రమున

ఉత్పత్తికాండము సర్వము

సమాప్తము.



THE INDIA PRINTING WORKS, MADRAS.

# విన్నపము

క॥ పలికితిని చేదుమాటలఁ
బలికితినే హితముకాని పలుకుల నొకచోఁ
బలికితినిపో ననుం గృపఁ
దలియుమి యని మనుపరయ్యు ధీరప్రవరుల్.

క॥ నరులార! మీరు మీతర
తరముల వారికిని భారత భువికిని శుభం
బరసియు తెగించి వ్రాసితిఁ
బరుషమ్ములైనను గణింపవలయు విషయముల్.

# GLOSSARY

## పారిభాషిక శబ్దములకు నింగ్లీషు టీక

(ఈ గ్రంథముయొక్క ప్రథమ సంపుటములోని యతి విపులమైన ఈ మాదిరి టీకను చూచుటయు నగత్యము.)

---

అంతరంగ నిర్బంధము = Internal sanction or compulsion
అఖండక్షోభ = General crisis
అధికోత్పత్తి = Over production
అనిరుద్ధ ఇత్యాది = Unlimited, Uncontrolled, Unrivalled
అన్వేషణ = Seeking, demand
అన్యోన్యపద్ధతి = Co-operative principle or system
అపరోక్ష = Direct
అపవాదము = Exception
అరాజక వాదము = Anarchism
అర్థి = Demander
అరువు = Credit
అవ్యవహిత = Continuous, without stopping
అహంత = Ego
ఆర్జవము = Honesty
ఆవేశనము = Factory
ఉత్పత్తి, ఉత్పన్న ఇత్యాదివ్యయము = Cost of production
ఉద్దీపకము = Stimulus
ఉద్వహనయంత్ర = Lift, Elevator
ఉపకర్మ, ఉపకళ = Subsidiary industry, Bye-industry
ఏకతంత్ర, ఏకరాజక, ఏకేశ్వర = Tyranny, Despotism, Monopoly
కర్మవేతన = Piece wage
కర్మోపసంహార = Strike, Refusal to work
కార్యచక్ర = Sphere of Industry, The Industrial world
క్రయ్య = Stock demanded at a pricer
క్రేయ = Stock offered for sale at a price
కారయిత = Employer
కార్యదర్శి = Secretary or Manager
శ్రమపరిచ్ఛేద, విభజన ఇత్యాది = Division of labour

ఖండక్షోభ = Partial crisis
గృహికవృత్తి = Domestic art
గ్రామ్యపద్ధతి = Village system
గ్రాహక = Buyer, Receiver
చోదక = Director
జాతి = Species
జాడ = Tendency
తఱుగుడు = Discount
దండనీతి = Punishment, Physical force
ధర్మసంధి = Trust
ధర్మన్యాయము = Statute Law or Moral Law (according to Context)
దాయక = Seller
దేశపద్ధతి = Principle of Nationality or Country-state
దేశము = Space, Country
నాణెము = Credit, Coin
న్యాయ / న్యాయము } Law
నిరర్గళ యిత్యాది = See అనిరుద్ధ
నివేశనవృత్తి = Domestic or household industry
నీతిన్యాయము = Moral Law or Policy (according to Context)
పణ్యసౌలభ్య = Easy marketing
పరతంత్ర = Unfree
పరస్పరపద్ధతి = Co-operation
పరోక్ష = Indirect
ప్రకృతిన్యాయము = Natural Law
ప్రభుత్వ సమష్టివాద = State Socialism
ప్రయాసవ్యవచ్ఛేద = Division of labour
బలాత్కారసంశ్లేష = Integration or unity by force
బహిర్నిర్బంధ = External sanction or compulsion
బహురాజక = Divided or many-headed authority
భాగస్థసభ = Shareholders' meeting
భోక్తృ = Consumer
మధ్యవర్తి = Middleman
మాత్సర్య యిత్యాది = Competition
యానము = Transportation
రాజ్యాంగ సమష్టివాద = State Socialism
వ్యక్తివాద = Individualism
వ్యవహారనిర్మాత = Enterpriser
వాణిజ్యచక్ర = Sphere or world of commerce, Market
వినియోజకాన్యోన్యసంఘు = Consumers' Co-operative Society
విభజనసమాజ = Distributive Society
విశ్వాసము = Faith, credit

విస్తారవ్యాపార = Large scale industry
వృత్తిపరిణామము = Evolution of industry
వృత్తివిభేద్య, భేద యుత్పాది = Separation of trades
శుల్క = Duty
శ్రమవిభేద = Division of labour
శ్రేణి = Guild, Union
సంఘటితమూలధనసమాజ = Joint-Stock Company
సంగ్రహ } Small scale,
సంక్షేప } abbreviated
సంధి సంఘము = Trust
సంప్రతి = Auditor, accountant
సంభూయసముత్థాన = Joint = Stock Company
సంశ్లేష = Integration, Co-ordination
సమత్వ = Equality i.e., political and economic
సమష్టిరాజక = Government by Society as a whole
సమష్టివాద = Socialism
సమాజ వ్యాపార = Business Conducted by a Society
సమూలసంస్కర్త = Communist, radical reformer
సరణి = Tendency
స్పర్ధ = Competition
స్వతంత్ర = Free, Voluntary
స్వత్వ = Right of private property
సార్థ = Guild, Union
స్థానైక్య } Localisation,
స్థానీభావ } Unity of
స్థానసాంగత్య } locality
స్వామ్య = Private property
క్షోభ = Crisis

శ్రీయుత కట్టమంచి - రామలింగారెడ్డి కృత

# కవిత్వతత్త్వవిచారము

**Principles of Poetry**
**with special reference to the works of**
**PINGALI SURANARYA.**

## సంక్షిప్త విషయసూచిక

---

ఆధునికకవుల గుణదోషములు-గద్యపద్య తారతమ్యము-భావనాశక్తి-నాటకరచనాశక్తి. భాషాచరిత్రమును దేశచరిత్రమును నిత్యసంయోగములు. పాండిత్యబలము. భారతకవుల ప్రతిభ-జనకవిత్వయుక్తి లక్షణము. ప్రబంధ లక్షణ విమర్శన. సూరన్నగారివి, చిత్రకవిత్వము-మోహ ప్రకృతి-వ్యక్తి వర్ణన ముత్కృష్టము-ప్రాచీనుల మోహతాపము-పాశ్చాత్యుల శృంగార వర్ణనము-అసహ్య శృంగారము-ఎఱ్ఱా ప్రగ్గడ-నన్నయ-తిక్కన-భారతకవుల శృంగార వర్ణనము దివ్యము. ఉపసంహారము:—

మఱియు ననేక మహత్తర విషయములిందు విపులముగా చర్చింపఁబడినవి. సుప్రసిద్ధ కవి వర్యుడగు సూరనార్యుని గ్రంథముల గూర్చిన విమర్శనమే ప్రధానమైనను నిం-దాది కవుల ప్రతిభాశక్తియు, తరువాతి వారి రచనలందలి లోగుట్టులును నిష్పక్షపాతముగా విమర్శింపఁబడినవి.

వేమేల! మన యాంధ్రభాషా ప్రపంచమంతయు నీ విమర్శ కుడు సంచరించి సూక్ష్మ దృష్టితో పరిశీలించి విశేషాంశముల వెద జల్లియున్నాడు. అనుదిన మిసుళ్ళ పుట్టవలె గ్రంథము లవతరించు నీకాలమున, ప్రతి నిరక్షర కుక్షియు గ్రంథకర్త యను మహాబిరుదము నందగోరు నీయుగమ్మున, నిజముగా నీ గ్రంథ పఠనము ప్రతివారి కెంతయు నావశ్యకము. ఆశుకవులు, బాలకవులును, శతావధానులును, పండితులును, విద్యావంతు లును, గ్రంథకర్తలును ఈ గ్రంథమును తప్పక పఠించవల యును. మనోహరమగు పద్యము లెన్నిటినో ఇందుదాహ రింపబడినవి.

ఆంధ్రాంగ్లేయ భాషా విశారదులగు పండిత శ్రేష్ఠులు, భాషాకోవిదు లీ గ్రంథమును మిక్కిలి పొగడియున్నారు. "జగమెఱిగిన బాపనికి జన్నిదమేల?" యన్నట్లు, ఈ గ్రంథ కర్తగారిని గూర్చిగాని వీరి శైలి రచనా చమత్కారములను గూర్చిగాని వేఱుగా వర్ణించుట యనవసరముగదా!

ప్రతులు స్వల్పముగా నున్నవి. క్రొత్తరకము అచ్చు. ముద్దులొలుకు బైండింగు. వెల. 1 8 0 మాత్రమే.

చిరునామా:—

హెచ్. వి. కృష్ణా అండ్ కో,

చింతాద్రిపేట మద్రాసు.

# విజ్ఞానచంద్రికాగ్రంథమాల

## ప్రకటితగ్రంథములు

### చరిత్ర గ్రంథములు.

| | రూ. | అ. |
|---|---|---|
| హిందూమహాయుగము | 1 | 0 |
| మహమ్మదీయమహాయుగము | 1 | 12 |
| ఢిల్లీదర్బారు | 1 | 8 |
| ఆంధ్రులచరిత్రము 1-వ భాగము (ప్రతులు లేవు) | | |
| ఆంధ్రుల చరిత్రము (రెండవ భాగము) | 1 | 8 |

### జీవితములు.

| | | |
|---|---|---|
| అబ్రహాంలింకను | 0 | 12 |
| రా. బ. కందుకూరి వీరేశలింగముగారి స్వీయచరిత్రము | 1 | 8 |
| చంద్రగుప్త చక్రవర్తి | 0 | 12 |
| మహాపురుషుల జీవిత చరిత్రములు | 1 | 4 |

### నవలలు.

| | | |
|---|---|---|
| రాణీసంయుక్త | 0 | 12 |
| విమలాదేవి | 1 | 2 |
| విజయనగరసామ్రాజ్యము | 1 | 4 |
| డిటో శేపయుశవయు | 0 | 12 |
| రాయచూరు యుద్ధము | 1 | 4 |

| | రూ. | అ. |
|---|---|---|
| పాతాళభైరవి | 1 | 4 |
| అస్తమయము | 1 | 4 |

### ప్రకృతి శాస్త్రములు.

| | | |
|---|---|---|
| జీవశాస్త్రము (ప్రతులు లేవు) | | |
| పదార్థవిజ్ఞానశాస్త్రము మొదటిభాగము | 0 | 12 |
| రసాయనశాస్త్రము | 1 | 4 |
| కలరా | 0 | 6 |
| జంతుశాస్త్రము | 0 | 9 |
| వృక్షశాస్త్రము | 0 | 7 |
| శారీరశాస్త్రము ఆరోగ్యబోధిని | 0 | 11 |
| భౌతికశాస్త్ర ప్రథమపాఠములు | 0 | 10 |
| భౌతికశాస్త్రము | 1 | 8 |
| చలిజ్వరము | 0 | 7 |
| అర్థశాస్త్రము 1-వ భాగము | 1 | 8 |
| డిటో 2-వ భాగము | 1 | 4 |
| వ్యవసాయశాస్త్రము 1-వ భాగము | 1 | 4 |
| వ్యవసాయశాస్త్రము 2-వ భాగము | 1 | 8 |

N. B. ఈ పై వెలలు శాశ్వతపు చందాదారులు కానివారల కిచ్చునవి. చందాదారులకు పోస్టేజి మేమే భరించి వీనిని తక్కువ ఖరీదున కిచ్చెదము. నియమములను జూడుడు.

జూలై 1914.

ఆ. లక్ష్మీపతి, బి. ఏ. ఎం. బి. సి. ఎం.
మేనేజరు.

విజ్ఞానచంద్రికా గ్రంథమాల. 25.

క్రొత్తనవల! ప్రథమాంధ్రనవల!!

# రాయచూరుయుద్ధము

(Battle of Raichur)

కథ : ఆంధ్రదేశచరిత్రాత్మకము.

ఆంధ్రదేశచరిత్రాత్మక నవలలో నిదియె మొదటిది. అద్భుతముగానుండును. రామయామాత్యుని కృత్యము లద్భుతములు; భయంకరములు. విజయసింహుని సాహసౌదార్యములు 'బళీ' యనిపించును. ముక్తాంబ బుద్ధికుశలత వర్ణనాతీతము. అనంగసేనస్థితి జాలికరము. మాలతి చాకచక్యము 'వాహ్వారే' యనిపించును. తిమ్మరుసు మాంత్రికము అసమానము. కృష్ణరాయుని రణకౌశల్యము ఆంధ్రుల గర్వితుల జేయును. రామరాజు శంకరరెడ్డి మొదలగువారు మారురూపములను దాల్చి కార్యసాఫల్య మొనర్చుట విచిత్రము. పెద్దనవల. చిత్రమయిన నవల. బొమ్మలుగల నవల. ప్రథమాంధ్రనవల.

ఇంత యేల కథ తీగెవలె ప్రాకిపోవుచుండును.

మదాలస, తారాబాయి,

రుక్షస్తిలక మొదలగునవలలను

వ్రాసిన కేతవరపు. వేంకటశాస్త్రిగారిచే రచియింపఁబడినది. క్యాలికోబైండు. 350 పుటలు. వెల రు. 1-4-0.

చిరునామా:--

విజ్ఞానచంద్రికా మండలి.

చింతాద్రిపేట - మద్రాసు.

# అమూల్యగ్రంథములు!!!

## ఆంధ్రరఘువంశము.

కాళిదాసు సంస్కృతమునకు తెలుగీతమ్ములు. సమూలము. భాషాంతరమును మిగుల కొనియాడియున్నారు. గొప్పగ్రంథము. వెల రు. 1-0-0

## విజయేంద్ర విజయము.

కథాకల్పన మద్భుతము. వర్ణనలపూర్వములు. భక్తి రసబోధకము. నీతి వాక్యసంభరితము. పూర్వప్రబంధములవలెగాక స్త్రీపురుషాదులందరు చదువవచ్చును. వెల 0-12-0

## శ్రీరామచరిత్రము.

బమ్మెరపోతనకృతము, భాగవతాంతర్గతము. శబ్దార్థాలంకార శోభితము. టీకాతాత్పర్య వ్యాఖ్యానసహితము. కవిహృదయ దర్పణము. విద్యార్థిమిత్రము. క్యాలికోబైండు— వెల 0-8-0

## లోకపావన శతకము.

శతకములలో విది క్రొత్తమార్గము. మిగుల హృద్యములయిన వృత్తములు. వెల 0-2-0

## త్రైవిక్రమ నాటకము.

వామనావతారకథ. వీరకరుణాభక్తి రసప్రధానము. పతనప్రదర్శనములకు రమ్యము. వెల 0-6-0 లు.

## రమేశచంద్రదత్తు.

రాజనీతి విశారదుడు. గొప్ప గ్రంథకర్త. దేశాభిమాని. హిందువులలో గొప్పపదవులను గౌరవమును బొందినవాడు. ఈజీవితము ఉమేశచంద్రబనర్జీ, ఆర్. వి. రంగరావుగార్ల జీవితములుకలిపి జీవితచరితావళిగా ప్రకటితమైనది. 160 పుటలు. మంచి బైండు, పటములు. వెల 0-6-0 లు.

## గీతాంజలి.

రవీంద్రనాథుని గ్రంథమునకు తెలుగు. పూర్వపశ్చిమ దిక్కుల యందు ప్రఖ్యాతిగన్నది. ఇందలి భావగంభీరమునకై రవీంద్రునికి రు. 1,50,000 ల నోబిల్ బహుమానము దొరికినది. చదవండి. ఉన్నతభావములను కలిగించుకొండి. వెల 0-8-0

## పురుషార్థప్రకాశము.

ప్రస్తుత కాలోపయోగమునకు తగిన గొప్పగ్రంథము. స్పెన్సర్ యొక్క విద్యావిషయమను గ్రంథముతో తులదూగుచుండును. రు. 1-4-0 లు.

## అజచరిత్ర.

ఆధునికకవిచే రచియింపబడిన పద్యకావ్యము. కథ రఘువంశములోని యిందుమతీ పరిణయము. భాషాప్రౌఢిమగలది. వెల 1-0-0

THE TELUGU ENCYCLOPÆDIA.

# శ్రీ ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము

ముఖ్య సంపాదకుఁడు: కే. వి. లక్ష్మణరావు, ఎం. ఏ.

౧౯౧౩ సం॥ జూలై మొదలు డబిల్ క్రౌన్ ౪ ఆకారమున నెలకు ౧౦౦ పుటల వంతున ఈ "విజ్ఞాన సర్వస్వము" వెలువడు చున్నది. మీకు సాధారణముగ నేవిషయమును గూర్చి తెలియవలె నన్నను ఈగ్రంథమును త్రిప్పినచాలును.

దేశముల చరిత్రలు, మహా పురుషుల జీవితములు, జంతు జీవ పదార్థవిజ్ఞాన రసాయన మొదలగు సర్వ ప్రకృతి శాస్త్రములును వానిలోని ముఖ్యవిషయములును, వేదవేదాంగ పురాణేతిహాస విషయములును, వడ్రంగము, కమ్మరము, పింగాణీ, నేఁత మున్నగు కర్మల విషయములును, శిల్పము గానవిద్య మున్నగు కళావిద్యలును, వైద్యము ,లా, మున్నగు లౌకిక విషయములును, అవి యివి యననేల? పాకశాస్త్ర విషయములతోఁ గూడ అన్ని విషయములును అకారాదిగ నీ విపులగ్రంథమందు వర్ణింపఁబడును. విషయములు బోధపడుటకు పటము లనేకములు గూర్పఁబడును.

దీనికి చందా సంవత్సరమునకు పది రూపాయిలు. దీనిని రెండుభాగములుగ ఆరుమాసముల కొకపర్యాయము వసూలు చేసికొందుము. ప్రథమసంచిక నంపి మొదటి ఆరునెలల చందా క్రింద అయిదురూపాయలు వసూలుచేసికొనగలము. ఐదు సంచికలు వెలువడినవి.

కే. వి. లక్ష్మణరావు, ఎం, ఏ.,
తెలుఁగు ఎన్సైక్లోపీడియా ఆఫీసు,
చింతాద్రిపేట, మద్రాసు.

# విజ్ఞానచంద్రికా గ్రంథమాల

చింతాద్రిపేట మద్రాసు

ఈ 3 గ్రంథములను గవర్నమెంటువారు పఠనీయములుగా నుంచుటకు సమ్మతి నిచ్చియున్నారు. 21-10-13. పేజీ 565 పోర్టు సెంటు జార్జిగెజటు.

## 1. రాణీ సంయుక్త

జగద్విఖ్యాతమై, నాలుగు నాటకరచనలకు మార్గదర్శకమై, శైలియందును వర్ణనలయందును, కథా చమత్కారమునందును నిరుపమానమై పండితుల చేతను, పామరుల చేతను, పొగడ్తగన్న ఈ అద్భుతనవలను గురించి ఎంత వ్రాసినను తనివిదీరదు. దీనిం జదివి యిందలిస్వారస్యమును పాఠకు లెఱుగ గ్రహింతురుగాక! గ్రంథకర్త. వేలాల-సుబ్బారావు. 0-12 0 లు మాత్రమే.

## 2. హిందూమహాయుగము

ఇది 250 పుటల గొప్పచరిత్ర గ్రంథము. హిందూదేశ కథాసంగ్రహముయొక్క మొదటి భాగము. మనపూర్వుల రాజ్యవిస్తారంబును, అప్రతిమ శౌర్యమును, అకలంక స్వదేశభక్తియు, తెలిసికొనగోరు వారీగ్రంథమును తప్పక చదువవలయును. అత్యంత పురాతనకాలమునుండి మహమ్మదీయుల దండయాత్రవరకు గల చరిత్రమంతయు సవిస్తరముగా వర్ణింపఁబడినది.

బుద్ధ, అశోక, కనిష్క, కాళిదాస, శ్రీహర్ష, చంద్రగుప్త, భవభూతి నన్నయ, తిక్కన మొదలయిన పవిత్ర జీవితములు శ్రద్ధతో వ్రాయఁబడినవి.

ఇది యింతవరకు విదుకూర్పులుపడి యెంతో జనసమ్మతమును వడసియున్నది. ఇట్టిది తెలుఁగులో లేదు. అనేక పరీక్షలకును, పాఠశాలలయందును పఠనీయముగ నియమించియున్నారు. నియమించుచున్నారు.

గ్రంథకర్త. కే. వి. లక్ష్మణరావు, ఎం. ఎ. వెల రు. 1-0-0 మాత్రమే.

## 3. పదార్థ విజ్ఞానశాస్త్రము

దీని నింగ్లీషులో ఫిజిక్సు అనెదరు. ఇది గొప్పశాస్త్రీయ గ్రంథము. ఇందనేక యపూర్వవిషయములు వర్ణింపఁబడినవి. పాఠశాలలోని 1, 2, 3 ఫారములకును ట్రైనింగుస్కూళ్ళకును అనుకూలముగ నుండునట్లు వ్రాయబడినది. వెల 0-12-0 లు. గ్రంథకర్త. ఎం. సాంబశివరావు, బి. ఏ. ఎల్. టి.

(ఈ 4 గ్రంథములు పుస్తక భాండారములయం దుంచుటకు గవర్న్మెంటువారు సమ్మతి నిచ్చియున్నారు. 21-10-1913 తేదీ 581 ఫోర్ట్ సెంటుజార్జి గెజటు.)

రావుబహద్దూరు క. వీరేశలింగమువారి —

# 1. స్వీయచరిత్రము

ఆంధ్రవాఙ్మయమున నిది క్రొత్తరచన. నవలవలె మనోజ్ఞముగా పంతులవారి చరిత్ర విరచింపఁబడియున్నది. వెల రు 1-8-0

# 2. రసాయన శాస్త్రము

దీనిని కెమిస్ట్రి యందురు. ప్రకృతిశాస్త్రజ్ఞానాభివృద్ధి కిది మిగుల సహాయకారి. పటములుగలవు. వెల 1-4-0

# 3. విమలాదేవి.

విచిత్రమైన చరిత్ర విషయకనవల. రంగులపటములు కలవు. చదువ మొదలిడిన ముగించుదనుక పుస్తకమును క్రిందపెట్టరు. వెల రు 1-2-0

# 4. కలరా.

ఇది యమూల్యమైన వైద్యగ్రంథము. దీనిని బాగుగ పఠించి యందలి విషయములను గమనించినయెడల ఈ వ్యాధినుండి భయపడవలసిన యవసరము లేదు. మందులు, పథ్యపానీయములు వివరింపఁబడినవి. వెల. 0-6-0 లు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| మహామ్మదీయమహాయుగము. | 1 | 12 | చంద్రగుప్తచక్రవర్తి | 0 | 12 |
| అబ్రహాములింకను. | 0 | 12 | చలిజ్వరము (Malaria) | 0 | 7 |
| భౌతికశాస్త్రము. | 1 | 8 | అర్థశాస్త్రము. | 1 | 8 |
| జంతుశాస్త్రము. | 0 | 9 | ఆంధ్రులచరిత్రము (2 వ భా) | 1 | 8 |
| వృక్షశాస్త్రము. | 0 | 7 | మహాపురుషులజీవితచరిత్రములు | 1 | |
| శారీరశాస్త్రము. ఆరోగ్యభోధిని | 0 | 11 | వ్యవసాయశాస్త్రము. (1 వ భా.) | 1 | 4 |
| | | | డిటో (2 వ భా) | 1 | 8 |
| భౌతికశాస్త్రప్రథమపాఠములు | 0 | 10 | రాయచూరుయుద్ధము (నవల) | 1 | 4 |
| ఢిల్లీదర్బారు. | 1 | 8 | | | |

చిరునామా:— ఆ. లక్ష్మీపతి, బి.ఏ., ఎం. బి., సి. ఎం.
మేనేజరు— విజ్ఞానచంద్రిక.
చింతాద్రిపేట— మద్రాసు.

# వ్యవసాయశాస్త్రము

శాస్త్రీయపద్ధతులమీద తెలుఁగులో వ్రాయఁబడిన గ్రంథ మిది యొక్కటియె. రెండుభాగములు సిద్ధమయినవి. రెండుభాగములలో 5, 6 వందల రూపాయల విలువగల పుస్తకములలోని విషయములు సంగ్రహముగ, సులభశైలిని వ్రాయఁబడినవి. సుబోధకముగనుండుటకై యనేక పటములను చేర్చియున్నాము. వ్యవసాయాభివృద్ధికిని, దేశముయొక్క భాగ్యవంతమునకును పాటుపడువారు వీనినిగొని లాభముపొందుదురని నమ్ముచున్నాము.

గ్రంథకర్త పిఠాపుర సంస్థానములో వ్యవసాయ శాఖాధ్యక్షుఁడుగానున్న గోటేటిజోగిరాజు పంతులుగారు. మొదటిభాగము వెల రు. 1-4-0 రెండవభాగము వెల రు. 1 8-0

---

# అర్థశాస్త్రము

దేశముయొక్క నిజస్థితిని, రాజకీయస్థితిని తెలిసికొనగోరు వారికి శాస్త్రమే శరణ్యము. విఖ్యాత పండితవర్యులగు క. రామలింగారెడ్డి, ఎం. ఏ. గారిచే వ్రాయబడినది. మొదటిభాగము వెల 1-8-0

# మహాపురుషుల జీవన చరిత్రలు.

ప్రపంచమున మనుజులెక్కువగా పఠించవలసినవి మహాపురుషుల జీవనచరిత్రము లయినను మన భాషయం దట్టివి మిగుల తక్కువగా నున్నవి. జీవనచరిత్ర పఠనముచే పాశ్చాత్యదేశములో గొప్పగొప్పవారు పుట్టినారు. దేశమునకు మహోపకారము చేసినారు. స్మయిల్సువంటి గ్రంథకర్తలకు సామగ్రి దొరకినది. ఈ సుపరోద్దేశముతో మే మీ గ్రంథమును ప్రచురించియున్నాము. ఇందు ప్లూటార్కువర్ణిత చరిత్రలును, బెంజమిను ఫ్రాంక్లిను చరిత్రయుగలవు. ప్లూటార్కు మహాకవికి పాశ్చాత్యదేశములలో చాల మన్ననగలదు. ఫ్రాంక్లిను యోగ్యత లోకవిదితము. కావున గ్రంథస్థ విషయ గౌరవమునుగూర్చి వివరింప వలసిన పనిలేదు. వెల. రు 1-4-0

గ్రంథకర్త వ. శ్రీనివాసరావు, బి.ఏ,

---

విజ్ఞానచంద్రికామండలి, చింతాద్రిపేట—మద్రాసు.